# సనాతన సారథి

సత్య ధర్మ శాంతి ప్రేమల ద్వారా మానవజాతి యొక్క

సామాజిక నైతిక ఆధ్యాత్మికాభివృద్ధి కల్పితము

సంపుటము 23 జనవరి 1980 సంచిక 1

## విషయానుక్రమణిక

చిత్రములు (1) దైవదర్శనం చేసుకొంటూ సాగుతున్న బాలవికాస్‌పిల్లలు (2) పూర్ణచంద్రఆడిటోరియంలో 22-11-79 నాడు ఊటి "శ్రీసత్య సాయి విద్యావిహార్ "పిల్లలు



---

చందాదారులు గమనించండి !

మీ చందా గడువు ఏ నెల ఏ సంవత్సరముపరకు ఉన్నదో మీ చందా రసీదు కార్డులోను, మీకు నెల నెలా పంపుచున్న పత్రికపైనున్న విలాసము గల కాగితము లోనూ తెలుపుచున్నాము. దానిని గమనించి, ఆ నెంబరు " /-2-''80 అనియుండిన, మీ చందా ఫిబ్రవరి నెలలో అయిపోవునని తెలుసుకొని క్రొత్త చందా (సం॥నకు రూ. 6) జనవరి నెల 31 వ తేది 1980 లోపల పత్రిక యొక్క కార్యాలయమునకు చేరునట్లు పంపవలెను

–: శ్రీ వారి కార్యక్రమములు :

బాబావారు ప్రశాంతి నిలయము నందున్నారా అని తెలిసికొన గోరు భక్తులు పబ్లిక్ రిలేషన్స్ ఆఫీస్, ప్రశాంతి నిలయము పోస్టు, పెనుకొండ తాలూకా, అనంతపురం జిల్లా అనే విలాసమునకు రిప్లయి కార్డు గానీ రిప్లయి పెయిడ్ టెలిగ్రాం గాని పంపవలెను లేదా కొత్తచెరువు 36 నెంబర్‌కి ఫోన్ చేయవలెను.

సంవత్సర చందా 6 రూ॥ గడువు ముగిసిపోవుటకు ముందుగనే మీ చందానంబరుతో చెల్లించవలయును.

వివరములకు అట్టలోపలి భాగములో చూడండి



దైవదర్శనం చేసుకొంటూ సాగుతున్న బాలవికాస్ పిల్లలు



పూర్ణచంద్ర ఆడిటోరియంలో 22-11-79 నాడు (ఊటి) " శ్రీసత్యసాయి విద్యావిహార్ " పిల్లలు




భగవాన్ శ్రీ సత్యసాయిబాబా

## 13

"అస్తం గతయా క్షీణయా మస్యాం జ్ఞానేన రాఘవ'' ఈ అవిద్య క్షయించి నాశనమొందిన నదెట్లుగలిగెనో; యెట్లు వృద్ధినొందెనో, యెట్లు నశించెనో, అను అంశమును తెలిసికొనగలవని వసిష్ఠులవారు రాఘవునకు తెలిపిరి.

ఈ ఉపదేశమునందు ఒక రహస్యమున్నది. ఈ ప్రపంచమెచటనుండీ, యెటుల వచ్చినదని. యుగ యుగములు విచారించిననూ తేలదు! ఏ విద్యవలన ఇది యెచ్చటనుండియైనను వచ్చి యుండినచో. విచారణాఫలితము ఉండును. కానీ. జగత్తు అట్టి విషయము కాదు జగత్తుయెటులకలిగెనను ప్రశ్న రజ్జు సర్ప భ్రాంతి యందలి సర్పమెట్లు ఉద్భవించినదను ప్రశ్న తుల్యము. అచటనున్నది త్రాడు కాని, అద్దానినుండి సర్పము ఉద్భవించెను. ఈ సర్పోద్భవకారణము చూచునట్టివాని బుద్ధి యందుగల దోషము. అనగా భ్రమ. లేక అజ్ఞానము. కావున సర్ప ఆవిర్భావ కారణము అజ్ఞానమువలన పుట్టెనను జవాబు యుక్తి సిద్ధము. అటులనే తాడు స్థానమున నున్నది బ్రహ్మము. పాము స్థానముననున్నది జగత్తు. అనగా బ్రహ్మమునే మనము భ్రాంతి వలన జగత్తుగా తలంచి వ్యవహరించుచున్నాము. ఇచ్చటకూడా చూచునట్టివాని బుద్ధి దోషమన కతీరదు.

అనగా ఒక వస్తువును మరొక వస్తువుగా చూచుట బుద్ధి దోషమని తేలుచున్నది. కావున, ఈ జగత్తు నా బుద్ధి దోషమువలన ప్రభవించిన విషయమని నిశ్చయింపనగును. ఇట్టి బుద్ధి దోషము

వలన భ్రాంతివలన, జనించిన విషయమెన్నటికిని సత్యముకాదు. భ్రాంతినశించినపుడు తజ్జనిత విషయముకూడా నశించును; యథార్థము గోచరమగును. ఇది వేదాంతసారము.

"అహం అజ్ఞః" నేను అజ్ఞానిని అని ఎవరికి వారు ఒప్పుకొనక తప్పదు. అనగా శాస్త్ర సిద్ధాంతము ననుసరించి చూడ, బ్రహ్మమై యుండియు అట్లు తెలియక జీవుడనని అనుకొనుచున్న "నేనే" అజ్ఞానినని తెలియవచ్చినది. అయితే, తన్ను తాను మఱచి అన్యముగా తలంచుకొనుటయను విషయము సంభవమా. అను సంకోచనివారణార్థము అనేక విషయములు తెలుసుకొంటిమి.

ఎవడు మిథ్యా దృష్టితో కూడియుండునో వాడు అజ్ఞాని అగుట సమంజసము. ఈ భ్రాంతి పురుషుని చిత్తము నాశ్రయించి యున్నది. దాని వలన తన నిజస్వరూపమును విస్మరించి, అనగా ఆనందస్వరూపమును మరచి జీవునిగా భ్రమించి, సుఖము అన్యమున కలదని సంసారమున బడి, పరిభ్రమించుచున్నవానిని గూర్చి "ఆత్మను వెదకి తెలిసికొని ధన్యుడవు కమ్ము"ని శ్రుతి బోధించుచున్నది.

అద్వైత ప్రబోధము, నిజముగా అజ్ఞానమను ఒక వస్తువు కలదని ఋజువు చేసి నిరాకరించుటకుప్రవర్తిల్లుట లేదు. "నాకు సుఖము లేదు," "ఇది కావలయును." "దానిని నేను సాధింపవలయును అనుభవింపవలయును" అను నట్టి బుద్ధియే జీవత్వము. ఇట్టి బుద్ధినే అజ్ఞానమని అందురు. కావున జీవత్వము నశించవలెనన్న ఇట్టి బుద్ధి "నేను సుఖ స్వరూపుడను, అప్రకాముడను" అను తెలివిగ పరిణమించ వలెను. పై భావమునకు అజ్ఞానమనియు, రెండవ భావమునకు జ్ఞానమనియు, అనగా జీవత్వ బుద్ధి అజ్ఞానము. సుఖస్వరూపుడనను బుద్ధి జ్ఞానము. లేని చిక్కులు నెత్తిపై వేసుకొని గిలగిల తన్నుకొనుచు చచ్చుచు. ఏట్టుచు బంధములో నుంటినని తన్నుకొనుచు ఉన్న జీవుని అట్టి అజ్ఞానమునుండి తొలగించుటకు నీవట్లు అనుకొనుటయే అజ్ఞానము సుమా! అని నిర్వచించి నిజజ్ఞానమును కలుగజేయుటకే అద్వైత శ్రుతులు ఉపన్యసించినవి. "బంధీ కృతుల"మని అనుకొనుచున్నప్పుడు మనమే అజ్ఞానులము. యథార్థమున మనము దేనివలన సృజింపబడలేదు కించిజ్ఞునిగా చేయుబడలేదు. ఈ జగత్తు ఒకటి కలవని ఇందుగల భోగ్యజాతములలో నేనొకడని. నేను జననమరణాదులు. సుఖ దుఃఖాదులు కలవాడనని అనుకొనుటే అజ్ఞానము. ఎట్లు తలంచుకొనిన అట్లగుదుము.

ఈ విధముగనే మానవుడు తనకు తానే అజ్ఞానమును నిర్మించుకొనుచున్నాడు. ఇట్లు పొందుటకు ఆధ్యాత్మిక దృష్టి శ్రద్ధా భక్తి ఈశ్వరానుగ్రహములేని కారణము. ఇందు ఏది లోపించినను పరమార్థానుభవము అసంభవము. అట్లు బాహ్యముగా విచారించగా ప్రపంచమని లేని దానిని ప్రపంచము, కాని దానిని మనము మన అజ్ఞానమువలన ఉన్నదని అనుకొనుట వలన జనించినదియేయని తెలును. అనగా సర్వము అజ్ఞాన జనితమని తెలును. కావున ఇంతటి బ్రహ్మాండము చివరకు "నేనను కొనుట—అను

కొనకపోవుట"లో, ఆధారపడి యున్నదనినమాట చాల చిత్రముగానున్నది.

సృష్టిమనము కలదనుకొనుట వలన కలిగి లేదనుకొనుటవలన నశించగలదని. నిర్వచించ గలిగినందున, నీవు అనుకొనుట అను విషయ మును లోతుగ తరచి చూడవలసి యున్నది. ఇట్లు కలదనుటతో ఒక వస్తువు యొక్క ఉనికి కలిగి లేదని అనుకొనుటతో అట్టి వస్తువు పోవుట. మన అనుభవములో ఎచ్చటనైనను కలదా! లేక ఊహా ప్రపంచముయొక్క విహారమా? అని విచారించిన ఒక్కచోట ఆ సత్యము ఋజువగు చున్నది.

త్రాటిని చీకటిలో చూచి పొరపాటున. అజ్ఞా నమువలన పామని అనుకొనుట తటస్థించిన యె డల తాటి స్థానమున పాము సృజింపబడి విల సిల్లు చున్నది. కారణాంతరమున యథార్థము గోచరించినపుడు ఇది పాము కాదు. త్రాడు అని అనుకొనుటతో, ఇదివరకు పామని అనుకొనుట వలన పాముగను. కాదని అనుకొనుటవలన త్రాడుగను సృజింపబడినది. ప్రత్యక్షానుభవమగు పాము మిథ్యయనియు తేలినది. కావున అనుకొను టతో సృజింపులు వినాశములు జరుగ వచ్చునను సిద్ధాంతముపై యుదాహరణమూలమున కొంత సుబోధకము కాగలదు. కావున అనుకొనుట అనినను తలంచుట అనినను ఒక్కటే! ఇవి మనోవికార జాతములే అగుటవలన స్థూలముగ తలంపులుగ పరిగణింపవచ్చును. ఎన్ని అవాం తర భేదములున్నను సూక్ష్మముగ చూచిన అన్ని యు తలంపులే కదా! ఇట్టి తలంపులు ఎచ్చోట నుండి బయలు దేరుచున్నవి. ఇట్టితలంపులు స్వతంత్రముగ పుట్టుచున్నవా! అన్న ప్రశ్నకు ''బుద్ధిః కర్మాను సారిణి'' మన కర్మల అను రాగములచేత, కర్మ ఫలప్రేమచేత ఆచరించిన పనులను అనుసరించి తలంపులు పుట్టును. నాకు సుఖ శాంతులు కావలెనను తలంపు మొదటిది. ఇది జగత్తు సత్యమను భావముచేత అజ్ఞానముచేత కలుగును.

(సశేషము)

పంచ కోశముల నుండి వేరై - స్వప్రకాశముతో వెలుగునట్టిదియు. త్రిగుణములను సాక్షి భూతముగా చూచునట్టియు. చలింపనిదై పవిత్రమై శాశ్వతమై, విభాగింప శక్యముకానిదై, స్వయంభువై, శాంతస్వరూపమై అనంతమై జ్ఞానమై యుండునట్టి ప్రత్యగాత్మను తనలోనే తాను గుర్తింప వలెను.

—బాబా

# సాధన గురించి ఒకరి ప్రశ్న

"నేను సాయి సాహిత్యము చదువుతున్నాను. సాధన అంటే ఏమిటో, సాధనలో ఏమిచేయాలీ అనే సందేహం అపుడపుడు కలుగుతూ వుంటుంది.''

అయ్యా! సాధన అంటే మనం కోరుకునే దానిని పొందే విధానం అని చెబుతూ, అందులో మూడు విషయాలున్నాయంటారు స్వామి. వాటిలో మొదటిది వృత్తి. అంటే కోరుకునే వస్తువుపై ఆకర్షణ కలిగి వుండటం. కోరుకునేదాన్నిగురించి తపన లేకపోతే సాధన ముందుకు సాగదు. అయితే వృత్తి ఒక్కటే సరిపోదు. సాధనలో రెండో విషయం: కోరుకుంటున్న దానిని సాధించగల శక్తి మనకి వుందని ఆత్మ విశ్వాసం కలిగివుండటం. కోరుకున్నదానికోసం తపన, దానిని పొందడానికై తగిన శక్తియుక్తులువున్నవనే ఆత్మ విశ్వాసం కూడా సాధనలో సరిపోవును. మూడవ విషయం: కర్మ లేక ప్రయత్నం. కర్మ లేనిదే ఏమీ జరగదు. మనం దేనిని కోరుకుంటున్నామో దానిని నిజంగా స్వంతం చేసుకోవాలి.

శ్రీ బాబావారు, ఈ మూడు విషయాలతో కూడిన సాధన, ప్రాపంచిక విషయాలకు ఎంత అవసరమో ఆధ్యాత్మిక జీవితానికికూడ అంత ముఖ్యమనీ చెబుతారు. మరోలా చెప్పాలంటే నీవు ఏ వస్తువు కోసం తపిస్తున్నావో దాన్ని పొందటంకోసం నీవు చేస్తున్న కర్మతోపాటు, ఆత్మవిశ్వాసమే కాక, ఆ వస్తువును పొందగలననే ధైర్యం కలిగివుండాలి.

ఈ మూడు విషయాలతో కూడిన సాధనలోని అంతశ్శక్తి సామాన్యజనావళికి తెలియని గొప్ప రహస్యం. కానీ భగవాన్ శ్రీ సత్య సాయిబాబావారు తమ భక్తులకు ఈ రహస్యం వెల్లడించారు. ఈ రకమైన సాధనను నిత్యజీవితంలో తీవ్రంగా వినియోగించటంద్వారా నీవు కోరుకున్నదానిని సాధించగలవనేది దైవం యిచ్చిన అభయం. కోరుకున్నదానిని సాధించే విధానం తెలుసుకొన్న తరువాత, కోర్కెలలో విచక్షణ చూపించడం అత్యవసరం. దాని తరువాత సాధనలో నిమగ్నం కావచ్చు.

కోర్కె అంటే ఏమిటి? కోర్కె అనేది నీ జీవితంలో ముఖ్యమైన శక్తిగా రూపొందిన భగవంతుడు. నీవెవరు? నీవు ఉన్నతోన్నతమైన వాడివి. నీ అంతరాంతరాల్లో దైవ శక్తి యిమిడియున్నది. నీచమైనది ఉన్నతమైన దానిని తృప్తి పరచగలదా? దైవంతప్ప వేరెద్దియూ, నిజానికి నిన్ను పూర్తిగా తృప్తి పరచజాలదు. భగవంతుడు మాత్రమే కోరి పొందగలందులకు అర్హతయున్నవాడు. అట్లే సాధనద్వారా ఉన్నతమైన వస్తువు మాత్రమే పొందడానికి అర్హమైనది. భగవంతుని సౌందర్యముకంటే తక్కువదానిని, దైవసన్నిధికంటే తక్కువైన పెన్నిధిని, దైవ శక్తికి దీటైన శక్తికనీ, మీదుమిక్కిలి భగవంతునికంటే వేరే విషయమును సాధించటంవలన కోర్కెవల్ల కలిగే బాధనుండి విముక్తి పొందజాలం. భగవాన్ శ్రీ సత్య సాయి మన హృదయంలో నిబిడీకృతమైనపుడు ఆదిఅంతములేని ప్రేమ వాహిని. ఆ ప్రేమ వాహిని

నుంచి విడదీయబడి నంతకాలము మన హృదయము లోని వాంఛ తృప్తిగా తీర్చబడజాలదు.

నీవు సాయి భక్తుడివైనపుడు నీ దిన చర్యలో సాధనకు సంబంధించిన రెండు విషయాలను యిమిడించుకొన్నావు. నీవు దైవంపై పవిత్ర ప్రేమ కలిగి, ఆయనచే గాఢంగా ఆకర్షింప బడుతున్నావు. ఇంతే కాక నీ ఆధ్యాత్మిక జిజ్ఞాస, సాధన చేయడానికి అవసరమైన బలం, ఆత్మ విశ్వాసం నీలోవున్నాయని ఋజువు చేస్తోంది. ఏతావాతా నిన్ను తికమక పెడుతున్నది సాధనలోని ప్రయత్నానికి సంబంధించిన విషయం.

సాయి సాహిత్యం చదువుతున్నపుడుకూడా నీవు ఎందుకు తికమకపడుతున్నావు ? నా ఊహ నిజమయితే, ఏమి చేయాలనే విషయంగురించి నీలో ఒకే సారి అనేక వత్తిడులు కల్గుతున్నాయి. పుస్తకాలలో చాలా విషయాలు వివిధ ప్రక్రియలు తెలియజేయ బడతాయి. ప్రతి కర్మకూడా 'సాధన'గా పిలువబడ్తుంది. ఈ విషయంలో స్వామి ఒక ముఖ్యసూత్రం చెప్పారు. అది నీవు తప్పక గమనించాలి

అగ్గిపెట్టెలో నూరో అంతకన్న ఎక్కువో అగ్గిపుల్లలుంటాయనీ, ప్రతి అగ్గిపుల్లా నిప్పు పుట్టించగల శక్తి కల్గియుంటుందనీ స్వామి చెబుతూంటారు. మనల్ని ఒక చిన్న అగ్గిపుల్లకు పెద్ద అడవిని ఆహుతి చేయగల శక్తిని గమనించమని ఆయన అంటారు. అగ్గిపుల్ల అడవిని ఆహుతి చేయడమే కాక తన దారిలో తగిలిన ప్రతివస్తువునూ చివరికి పచ్చి కలపనూ, తడి కట్టెలనూకూడా బూడిద చేస్తుంది. అంత మంట పుట్టించటానికి నూరు అగ్గిపుల్లలను గీయాల్సిన అవసరంలేదు. నిపుణతతో, జాగ్రత్తగా ఒక అగ్గిపుల్లను గీస్తే మంట పుడ్తుంది.

ఈ ఉదాహరణతో స్వామి మనకు ఒక సాధనా ప్రక్రియను మనస్ఫూర్తిగా పరిపూర్ణ హృదయంతో ఆచరిస్తేచాలని తెలియ చెబుతారు. మిగిలినదంతా దానికదే అనుసరిస్తూ వస్తుంది.

నీ సాధనలో స్వామి తరచుగా చెప్పేక్రియల నెందుకు ఆచరణలో పెట్టకూడదూ ? స్వామి పవిత్రమైన ప్రేమను భగవదర్పితం కావించటం దైవాన్ని చేరడానికి రాచమార్గంగా వక్కాణిస్తారు. నీవు ఇప్పటికే శ్రీ సత్య సాయీశుని కోసం తపిస్తూ ఆయనను ప్రేమిస్తున్నావు. తన దివ్యానుగ్రహం అందిస్తూ స్వామి మనకీక్రింది విధంగాకూడా చెబుతారు.

ఎవరిని మనం ప్రేమిస్తాము ? ఎవరు మన వెంటగా జంటగా ఎల్లపుడూ వుండాలని తలస్తూంటాము ? ఆదర్శమూర్తిగా సదా మనతో నుండమనీ, అనుగ్రహించి మన తప్పులు మన్నించి వారి ప్రేమనూ, అనుగ్రహమునూ మనపై వర్షించమనిన్నీ శ్రీ సత్య సాయి భగవానుని ప్రార్థించాలి. మనహృదయంలో భగవంతుని మూర్తిని ముద్రించుకొని, అతని నామస్మరణం కావించుకొంటే దానిని తానెప్పుడూవిని దానికి సమాధాన మిస్తానని స్వామి వాగ్దాన మిస్తారు.

"సాయిరాం, సాయిరాం, సాయిరాం," అంటూ ప్రేమభక్తులతో నామస్మరణ గావించి, సాయి రూపము మనస్సులో ముద్రించుకోవటం సాయి సాధననుపూర్తి చేయడానికి కావలసిన ప్రక్రియ. ఇదే నిద్రనుంచి లేచినది మొదలు తిరిగి నిద్రించేవరకు చేయవలసిన సాధన. కర్తవ్యదృష్ట్యా ఏదో పనిమీద నిమగ్నం కావలసి వచ్చినపుడు మనస్సులో భగవంతుని స్మరించి, నీ కర్మలను, వాటి ఫలితాలనూ ఆయనకర్పితం కావించి పరిపూర్ణ విశ్వాసంతో ఆ పనులను చేయటం మొదలు పెట్టండి. శ్రీ బాబావారు నీ కర్మ

లన్ను, ఆ కర్మల ఫలితాలను భగవదర్పణంగావిం చటం నామస్మరణతో సమానమనీ యిట్లా అర్పణ గావించుటద్వారా ఆయన నామములను మనస్సులో నిలచి ఆయనను నీ హృదయంలో నిద్రలేచినది మొద లు పరుండేవరకువుంచేట్లు చేస్తుందనీ చెబుతారు.

నీవు సాయి పుస్తకాలను చదివేటపుడు వాటిలో నామస్మరణ, మూర్తిని మనఃఫలకంపై ముద్రించు కొనే ప్రక్రియలగురించి తెలిపే పుటలను వెదకి వాటిపై దృష్టినికేంద్రీకరించమని నా సూచన; దానివల్ల సాధన గురించి నీలోకల్గిన చింత, అనిశ్చలత నీనుంచి దూర మవుతాయి.

—జాన్ హిస్లాప్.

# ఉత్తమోత్తమ సేవ

పంకజాక్షుని పూజ-పలుమారు సేయక
పరుల నిందించుట-పాటి యగునె?
విష్ణు సంకీర్తన-వీనుల వినకుండ
పరుల మెచ్చుట నీకు-ప్రాతి యగునె?
శేషశయను పూజ-చెలగి గావింపక
పరుల కీర్తించుట-భవ్యమగునె?
దామోదరుని గూర్చి-ధ్యానంబు చేయక
పరుల దోషములెన్న-భావ్యమగునె?
శ్రీరమానాథునెప్పుడు-చిత్తమందు
చింతచేసిన కలుగదే-చిత్తశుద్ధి!
ఇంతకన్నను వేరెద్ది-ఎరుక వరకు
సాధు సద్గుణగణ్యులౌ-సభ్యులార

దివ్యాత్మస్వరూపులారా? మానవులు, లోకమందు అనేకవిద్యలు నేర్చుచున్నారు; అనేక యంత్రములను సృష్టించుచున్నారు; అనంతమైన జ్ఞానమును ఆర్జించు చున్నారు. కానీ, దొరకవలసిన శాంతి లభించడం లేదు. నానాటికీ లౌకిక జీవితనదిలో అనేకులు కొట్టు కొని పోవుచూ, శాంతికి అతిదూరమైపోతూన్నారు. దివ్యమైన మానవత్వము ప్రాప్తించిననూ, సత్యమార్గ మును గుర్తించక దివ్యజీవితాన్ని వ్యర్థం గావించుకో వడం మానవుని కర్తవ్యం కాదు. విద్యలను నేర్చి నంతమాత్రమున, యంత్రములను సృష్టించినంతమా త్రమున జ్ఞానులమని విఱ్ఱవీగినంతమాత్రమున, తమ మానవత్వ రహస్యాన్ని తెలుపుటకు వీలుకాదు. సృష్టి రహస్యమును గుర్తించుటకు ఈ విద్యలు కాదు ప్రమా ణములు. ఏ రహస్యమును గుర్తించిన సర్వరహ స్యములు గోచరమగునో, పలుచిక్కులు దూరమగునో ఏ విద్యను నేర్చిన సర్వవిద్యలు అవగతములగునో, అట్టి దివ్యమైన విద్య, ఒక్కటి మాత్రమే! చెట్టును కొట్టదలచిన వాడు వేరును కొట్టినప్పుడే దానిని పడ దోయవచ్చును కానీ, ఆకులను చీల్చుచూ, కొమ్మలను కొట్టుచూ వచ్చినప్పుడు వృక్షము నశించుటకు వీలు కాదు.

ఋషులు అనేకవిధములైన ప్రయత్నములు సలిపి, సాధించి, మనకు అందించిన సుధానిధి, ఆత్మవిద్య. ఈ రహస్యమును విదేశీయులు గుర్తించి, భారతదేశ

హిక, ఆముష్మిక సంపత్సాధన ఆదర్శవంతమైనదని వేనోళ్ళ వర్ణిస్తూ వచ్చారు. కాని, ఇట్టి పవిత్రవిద్య ఇల్లంతయును జ్యోతివలె వ్యాపించి, ప్రకాశించుచున్నప్పటికినీ, భారతీయులు దీపము క్రిందనే ఉన్నారు. దీనిక్రీనీడ వారి ప్రారబ్ధంగా రూపొందుతూ వచ్చింది. మన ముత్తాతలు, తాతలు, తండ్రులు పవిత్రమైన భారతీయ సంస్కృతగ్రంథములను పఠించి, వర్ణించి, స్మరించి, పారాయణము జరుపుచూ అనేక విధములుగా శాంతిని అనుభవిస్తూ వచ్చారు. భారత, భాగవత, రామాయణ, భగవద్గీతాది గ్రంథములను పఠించి, వాటి నీతులను హృదయమునకు చేర్చుకుని, నిత్యజీవితమునందు ఆచరించుచూ, పూజాపీఠములపైన ఉంచి, పవిత్రమైన హృదయములతో పూజించుచూ వచ్చారు.

వారి హృదయములను, నీతి భావములచే నింపుకొని, ఆచరణరూపమైన అనుభూతులను అందించుచూ సమాజమునకు సేవ సలుపుచూ వచ్చారు. దురదృష్టవశాత్తు ఆధునిక యుగము ప్రారంభమై, కేవలము నవనాగరికతకు వారు లొంగిపోయి, ఈ పవిత్ర గ్రంథములను విశ్వసింపక అవి అనాగరికతా లక్షణములని భావించుచూ ఆ 'చెత్తపట్టిన చిత్తు' లను బయట పారవేస్తూ వచ్చారు, ఈ నాటి ప్రజలు. భారతీయులు పారవేసిన పవిత్ర గ్రంథములను పాశ్చాత్యులు స్వీకరించిరి. మహాభాగ్యమని లోలోపల భావించుచూ, వాటిని తీసుకొని పోయి పఠించి లోమన్న రహస్యములను చక్కగా పరిశీలన చేసి, వాటి ద్వారా ఈ నాడు భారతదేశీయులు ఉన్నతస్థానమునందున్నవారుగా భావించుచున్నారు.

అధర్వణవేదమును గ్రహించిన జర్మనీ ప్రజలు మన గ్రంథములందున్న అస్త్ర, శస్త్ర విద్యలను ఆధునిక వైద్యమును గ్రహించి, దానిని తిరిగి భారతదేశమునకే ఒక విచిత్రమైన రూపమున అందిస్తూ వస్తున్నారు. "తన గృహమునందువండినటువంటి పంచ భక్ష్యపరమాన్నములకంటే "పొరుగింటి పుల్లగూర రుచి" యన్నట్లు భారతీయులు, సర్వ రహస్యముల నెఱింగిన వారైనను, సర్వ శాస్త్రములను క్షుణ్ణంగా గుర్తించిన వారైనను పాశ్చాత్యులు అందించునట్టి ఈ అపవిత్రభావాలచే ఆకర్షింపబడుచు వస్తున్నారు.

ఈ నాటి విద్యార్థులు కేవలము తెలివితేటలను మాత్రమే పెంచుకొనుచూ, సుగుణములను విస్మరిస్తూ, తమ మానవత్వాన్ని మఱచి, భౌతిక జీవితమే ప్రధాన లక్ష్యంగా పాటిస్తూ వస్తున్నారు. విద్యార్థులు సుగుణముల నభివృద్ధి గావించుకొనునట్లు అధ్యాపకులు ప్రయత్నించాలి. తెలివితేటలకంటే గుణములే ప్రధానమైనట్టివి. ఈ నాటి విద్యారంగమందు ఏ విధమైన నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక గౌరవమనేది లేక పోవడం చేతనే, విద్యార్థులు అధోగతికి దిగజాఱుటకు మూలకారణమైనది. నైతిక గౌరవమంటే ఏమిటో వారు తెలియని స్థితిలో నున్నారు. తమ జీవితమునకు సమాజ క్షేమమే ప్రాణమని వారు అర్థం చేసుకోవడం లేదు. ఎన్ని విద్యలు నేర్చినప్పటికినీ, పరోపకారబుద్ధి లేకున్నచో అది అపవిత్రమైన భావాన్ని పెంచుతుంది. పరోపకార బుద్ధి మానవత్వజ్యోతిని ప్రకాశింపజేస్తుంది.

ఈ నాటి విద్యార్థులు ఈ అల్పవిద్యలను అధికంగా ఆర్జించి తమ హృదయవికాసాన్ని పెంచుకొనలేకపోవడమేగాక అహంకారాన్ని మరింత పెంచుకోడానికి ప్రయత్నిస్తున్నారు. అహంకారము సుగుణాన్ని మరపింప చేస్తున్నది. విద్యార్థులు దేశక్షేమాన్నిగాని, సమాజౌన్నత్యమును గాని, గుర్తింప లేకపోతున్నారు.

కంటికి పెట్టుకున్న ఈ అహంకారమనే అద్దముచేత తమ మానవత్వాన్నే మరచి పోతున్నారు. కనుకనే ఈ మానవత్వాన్ని ఉద్ధరించుటకై విద్యార్థులు ఎంతైననూ శ్రమపడవలసి వస్తుంది.

రాగ ద్వేషరహితమైన చిత్తము, అసత్యాదులతో కూడని వాక్కు, పాపపంకిలముకాని దేహము ఈ నాడు మన కవసరం. కనుక మానవుని రాగద్వేష ములను అరికట్టుటకై పవిత్రమైన సుగుణములను పెం పొందించడానికి, స్వార్థము, అసూయ, అహంకారము అనెడి ఈ మూడు పిశాచములను బాలురనుండి దూరం చేయడానికి, అధ్యాపకులు ఎంతైన ప్రయత్నిం చాలి. ఈ మూడు దుర్గుణములు హృదయమునందు ప్రవేశించెనా ఇంక మానవత్వమును ఏమాత్రమూ గుర్తించుటకు వీలు కాదు. స్వార్థరహిత సేవకు ముందంజ వేయాలి.

వృక్షములు స్వార్థరహిత సేవను సల్పుచున్నాయి. తమను మెచ్చుకున్న వారు కానీ, తమను ద్వేషించే వారుకానీ తమఛాయను వచ్చి కూర్చున్నప్పుడు అంద రికీ సమముగా చల్లని నీడను అందించి హాయిని చేకూర్చుచున్నవి వృక్షములు. నదులు, గోవులుకూడ స్వార్థరహితమైన సేవను సల్పుచున్నాయి. సమా జానికి, వృక్షములు, గోవులు, నదులు లేకుండిన క్షణకాలమైననూ జీవించుటకు వీలుకాదు. స్వార్థ రహిత జీవులద్వారా సుఖములననుభవిస్తున్న మాన వుడు, కేవలము స్వార్థపరుడై జీవిస్తున్నాడంటే, ఇది కేవలము మానవత్వానికే ఒక అగౌరవము. కనుక మానవుడు ఆర్జించినట్టి విద్యాధనమును కానీ, ఇంకే విధమైన ఐశ్వర్యమును కానీ స్వార్థరహిత కార్యము లందు ప్రవేశపెట్టడం ప్రధాన కర్తవ్యం.

అధ్యాపకుల ఆస్తి విద్య. ఈ విద్యను సక్రమ మార్గములో, స్వార్థరహిత భావముతో, జనసంబంధ మైన గుణపోషణనిమిత్తమై విద్యార్థుల హృదయానికి హత్తుకొనునట్లుచేయుటకు అధ్యాపకులు సంసిద్ధులై ఉండాలి.

భారతదేశమునందు శ్రీమంతులు, గొప్పగొప్ప విద్యావంతులు, గొప్పగొప్ప పీఠాధిపతులు మహామహా రాజులు లేకపోలేదు. ఇట్టి పవిత్రస్థానమును అందు కొన్నట్టి వ్యక్తులు ఉండినప్పటికినీ, శాంతి సంతోష ములకు నోచుకోలేకపోతున్నారంటే మూలకారణము ప్రవర్తనల దోషమే. ఈ నాడు అహంకారస్వార్థ ములు అందరి హృదయములందు ప్రవేశించి, తమ దివ్యశక్తులకు అనేక విధములైన అవాంతరములను కల్పిస్తూ వస్తున్నవి. కనుక ఈ దుర్గుణ ములను దూరం చేసేనిమిత్తమై విద్యార్థుల హృద యాలను పవిత్రపరచి తద్వారా భావిభారతోద్ధారకులుగా తీర్చి దిద్దేబాధ్యత అధ్యాపకులపై ఉన్నది. అధ్యాప కులు ఆదర్శమూర్తులు. వారాచరించి విద్యార్థులకు బోధించుటకై పూనుకోవాలి. ఎట్టి అధ్యాపకులో అట్టి విద్యార్థులుగా రూపొందుతారు. అధ్యాపకులు "వాటర్ టాంక్" వంటివారు. విద్యార్థులు కేవలం ట్యాప్ వంటి వారు. టాంక్‌లో ఎట్టి నీటిని మనం నింపు దుమో ట్యాపులో అట్టి నీరే వస్తుంది. కనుక అధ్యా పకుల హృదయమనే 'టాంకు'లో పవిత్రనిస్వార్థ భావములు, చేర్చుకొన్నప్పుడే, ఈ విద్యార్థులనెడి ట్యాప్స్ నందు పవిత్రమైన భావములు రూపొందు టకును, ప్రకటించుటకును, వికసించుటకును, అవ కాశము ఏర్పడుచున్నది.

ఈ నాడు సత్యసాయి బాలవికాస్ గురువులు, ఇం చుమించు 5000 మంది ఉన్నారు. ఒక్కొక్క అధ్యా పకుడు నూరుమంది విద్యార్థులను చక్కదిద్దిన దేశము

ఎంతో బాగుపడటానికి అవకాశమేర్పడుతుంది. బాల వికాస్ అధ్యాపకులు 5000 మంది ఉన్నప్పటికినీ, మన ము ఈ నాలుగు సంవత్సరములనుండి సాధించిన ఫలి తము ఏమిటి అని ఒక పర్యాయము మనం సింహావ లోకనం సలపాలి. మనం చేసే ప్రతి పనినీ క్షణక్షణము పరిశీలిస్తూరావాలి. ఏ గురువునందు సాత్వికమైన భావ ములుండునో, ఆ గురువుచెంత అధ్యయనం చేసేవిద్యా ర్థులకు అలాంటి సాత్విక భావాలు అభివృద్ధి చెందుతూం టాయి. కనుక విద్యార్థులయందు పవిత్రమైన భావ ములు అలవడుటకు మొట్టమొదట అధ్యాపకులు పవిత్ర గుణములను పెంపొందింపచేసుకోవాలి. మొట్టమొదట అధ్యాపకులు ద్వేషాసూయలూ, సంకుచితభావములూ తమలో నెంతమాత్రము ప్రవేశింపకుండునట్లు చూచుకో వాలి. ముఖ్యముగా అధ్యాపకులు ఈ రాజకీయ తత్త్వము అనే చీడ పురుగును తమ జీవితములో ఏ మాత్రమూ ప్రవేశించకుండాచూచుకోవాలి.

ఈ అధ్యాపకులలో కొన్ని కొన్ని పార్టీస్ బయలు దేరకూడదు. కొంతమంది అధ్యాపకులు తమ పేరు ప్రతిష్ఠలను అభివృద్ధి గావించుకొంటూంటే మరికొంత మంది అధ్యాపకులు వారిపై అసూయాభావాన్ని అధికం చేసుకుంటుంటారు. అధ్యాపక సోదర సోదరీమణులు తాము, దివ్యాత్మతత్త్వముయొక్క బిడ్డలుగా విశ్వసిస్తూ, ఏకాత్మభావాన్ని అభివృద్ధి పరచుకోవాలి. అంతో, ఇంతో, అప్పుడో ఇప్పుడో కొన్ని విరుద్ధమైన భావాలు మానవు నియందు చెలరేగుట మానవత్వలక్షణం. కానీ మీరు సత్యసాయి బాలవికాస్ గురువులుగా ప్రవేశించారు. ఇతర గురువులయందు ఏ విధమైన దోషములు ప్రవేశిం చినప్పటికినీ కొంత ప్రమాదము ఏర్పడదు. కానీ సత్య సాయి బాలవికాస్ గురువులయందు కొన్నివిధములైన దుర్గుణములు ప్రవేశిస్తే అన్నివిధములైన అవాంతర ములు అడ్డు తగులుతుంటాయి. కనుక బాలవికాస్ గురువులు 'గురు' అనుశబ్దములోగల అంతరార్థాన్ని గుర్తించడానికి ప్రయత్నించాలి. 'గు' కారమనగా అంధకారము. 'రు' కారమనగా తన్నివారణ. అనగా, అజ్ఞానాంధకారతత్త్వమును నిర్మూలనము చేసి ప్రకాశవంతమైన హృదయాన్ని అందించుటే ఈ గురు శబ్దోత్పత్తి. ఇంకా లోతుకు దిగి పరిశీలనం చేసినప్పుడు "గుకారో గుణాతీతః రుకారో రూప వర్జితః" ఈ గుణాతీత తత్త్వాన్ని ఈ రూప వర్జిత తత్త్వాన్ని తాను అనుభవించి విద్యార్థులకు అందించాలి. అనగా తమ అభిమాన మమకారములు విసర్జించి విద్యా ర్థులు మా బిడ్డలనే ప్రేమతత్త్వాన్ని పెంచుకొని సర్వాభి మానములు, విద్యార్థులయందుంచుకుని మనం విద్యను బోధించడానికి ప్రయత్నించాలి.

ఈ విధమైన భావములచేత మనము "సత్యసాయి బాలవికాస్"లో ప్రవేశించినప్పుడు దీనికొక సార్థకత ఏర్పడుతుంది. అయితే బాలవికాస్ గురువులు చాలా ఉత్తమమైన అభివృద్ధిని, పవిత్రతను అందిస్తున్నారనే సత్యము "సాయికి" తెలియకపోలేదు. మధ్యమధ్య ఒక 'బాటరీ'ని, 'ఛార్జి' చేసినట్లుగా ఈ విధమైన కొన్నిదోషములను మీకు ఎత్తిచూపుటద్వారా, కొన్ని అభివృద్ధి మార్గములను మనము కాంక్షించుట అత్యవ సరం. మీకు నిత్యజీవితములో కొన్ని అనుభవములు ఉండవచ్చును. పెట్రోమాక్స్‌లైట్‌నకు పంపుకొట్టి నప్పటికినీ అప్పుడప్పుడు దానికి పిన్ను తిప్పాలి. అయితే ఎంతపంపు కొట్టి నప్పటికినీ, ఎంత పిన్ను చేసినప్ప టికినీ, అందులో కొంత 'కిరసిన్' అనే 'ఆయిల్' కూడనూ చేరిఉండాలి. 'కిరసిన్' అనేదే మనశ్రద్ధ. మన ప్రేమయే పిన్ను. మన విశ్వాసమే పంపు. ఈ విధముగా మూటిని చేర్చుకున్నప్పుడే దివ్యప్రకాశాన్ని ఇతరులకు అందించడానికి వీలు ఏర్పడుతుంది. వీట న్నటికీ ఆధారమై దివ్యమైన నామ మనే వత్తి లైటుకు

ప్రధానము. ఇట్టిభావముల చేత మనము బాలవికాస్ గురువులుగా ప్రవేశించినందులకు, దేశమునందు అనాది కాలమునుండి ఆవరించిన ఈ అజ్ఞానమనే తత్త్వాన్ని మన ప్రయత్నములద్వారా కొంతపరిహరించి దివ్యాత్మతత్త్వాన్ని ప్రకటించుటకు తగిన ప్రయత్నము చేయాలి. నాలుగు సంవత్సరములనుండీ మనము బాలవికాస్ గురువులుగా పని చేస్తున్నాము. కానీ ఈ పనిద్వారా మనకు కలిగిన ఫలితమేమని ఈ సమావేశములో చర్చించి, దానికి తగిన కూర్పులు, మార్పులు, నవరించుకొనుటకు మనం ప్రయత్నం సలుపాలి. గురువులుకూడ కొన్ని గుంపులు గుంపులుగా నేర్పడి వారి వారి స్వానుభవముల తర్కించి దానికి సంబంధించిన మార్పులు అభివృద్ధి జేసికొని ఈ సమావేశములో ఒక నిర్ణయాన్ని మనం తీసుకోవాలి.

ఏ విధమైన మార్గాన్ని మనం అవలంబించినప్పుడు విద్యార్థుల యభివృద్ధినీ దేశాభివృద్ధినీ, సమాజ సుక్షేమాన్నీ కాంక్షించినవారమగుదమను విషయమునుకూడ కొంతవిచారించాలి. ఎట్టి ప్రవర్తనలు వారికి బోధించిన భవిష్యత్తులో వారు భద్రమగు జీవితాన్ని అందించగలరు, అనేవిషయాన్నికూడా విచారించాలి. కాన అధ్యాపకులనగా కేవలము దేశమునకు ఆదర్శవంతమైన జ్యోతులని విశ్వసించాలి. ఒక విద్యార్థి చెడితే కేవలము తానుమాత్రమే చెడగలడు. ఒక అధ్యాపకుడు చెడితే అనేక మార్గమంది చెడడానికి అవకాశముంటుంది. అధ్యాపకులు "గైడు పోస్టు" వంటివారుగా నిలవాలి. ఈ విధమైన విద్యార్థులకు సరియైన ఆదర్శము నందించడములో తాము విశ్చల మనస్సుతో ఉండాలి. "గైడ్ పోస్టు" ఊరికే అటూ ఇటూ, ఇటూ అటూ తిరుగుతుండటం తప్పుదారి పట్టిస్తుంది. "గైడ్ పోస్టు" స్థిరంగా నిల్చుకుని దృక్పథాన్ని చక్కగా ఇతరులకు వివరించాలి. అధ్యాపకులైన మనము, ఒక విశ్చలమైన భావము, నిస్వార్థమైన హృదయము, సంకుచిత దురుద్దేశాన్ని దూరం చేసుకునే ప్రేమతత్త్వాన్ని పెంచుకోవాలి. భక్తిప్రపత్తులనుకూడ అభివృద్ధి గావించుకోవాలి. ఏది చేసినప్పటికినీ భగవదర్పితంగా మనము భావించి ఆచరించాలి. కనుక సర్వత్రావిండిన సర్వేశ్వరత్వాన్ని మనం హృదయంలో నింపుకొని విద్యార్థుల హృదయాలకు హత్తుకొనునట్లు చేయుటకు పూనుకోవాలి. ఈ విధమైన ఉన్నత భావములచేత ఉత్తమమైన అభిప్రాయములచేత, మన గురుత్వాన్ని లోకానికి చాటుటకు పూనుకోవాలి. ఎట్టి ఫలితము లేకపోయినప్పటికినీ, స్వార్థరహితమైన సేవచేసే మీ కోటి గురువులు ఈ నాడు లోకానికి ఎంతైనా అవసరం. ఏ ఫలితము మీకు చిక్కక పోయినప్పటికినీ, దైవానుగ్రహమనే గొప్ప ఫలితము మీకు చిక్కుతుంది. ఈ నాడు కేవలము జీతములకోసమై ప్రాకులాడే అధ్యాపకులు, అధికమైపోవడం చేత స్వార్థ రహితులైన అధ్యాపకులను గుర్తించడానికి వీలు కాని పరిస్థితిలో ఉన్నది. విద్యార్థులకు మీరు బోధించాలి.

విద్య డిగ్రీల కొరకనే_వెఱ్ఱి వీడి
సేవకావృత్తి నీవెప్డు_సేయబోక
దేశసౌభాగ్యమెన్నడు_దీటులేక
కదపవలయును జీవిత_గరిమమింత

భారమైన డిగ్రీలు తలమీద పెట్టుకుని మరింత భారము ను అనుభవించేదానికంటే ఉత్తమమైన ప్రేమతో హృదయమును నింపుకోవాలి. కేవలం విద్యతో బుర్రను నింపుకోవడం కాదు. లోకములో నున్న విషయము లన్నిటినీ తలలో చేర్చుకుని తబ్బిబ్బైపోయే జీవితాన్ని మనం గడపకూడదు. గొప్ప విద్యావంతులైపోయి, వేలకు వేలు, లక్షలకు లక్షలు ధనమును ఆర్జించిన

ధీరులుకూడనూ లేకపోలేదు. ఈ జగత్తులో! కేవలము, వారి విద్యలన్నియు ధనార్జనకై ధారపోస్తున్నారుకానీ. దేశముయొక్క సుక్షేమమునకు ఏ మాత్రమూ వారు ప్రాకులాడటం లేదు. అట్టి విద్యావంతులవల్ల దేశమునకు ఏ మాత్రమూ ఉపయోగముండదు. తమ పొట్టను తాము నింపుకుని. తమ కుటుంబాన్ని తాము పోషించుకుని తమ పేరు ప్రతిష్ఠలకై ప్రాకులాడేట్టి విద్యావంతులు అధికంగావడంచేతనే మన పవిత్రభారతదేశసంస్కృతి ఈ నాడు సన్నగిల్లిపోయింది.

త్యాగమునకు మించిన గుణము మరొకటి లేదు. త్యాగమే గుణములన్నిటికిని, చక్రవర్తివంటిది. దీనిని పురస్కరించుకొనియే ఉపనిషత్తులలో "నకర్మణా నప్రజయా ధనేన, త్యాగేనైకే అమృతత్వమానశుః" అని ఉన్నది. కనుక నీవు త్యాగశీలుడవై పవిత్రమైన భావముచేత ఆర్జించిన విద్యను బాలురకు అందించి, తద్వారా దేశ కళ్యాణమును కోరుతూ రావాలి. ఇట్టి పవిత్రమైన చిత్తశుద్ధితో నిర్మల నిశ్చల హృదయులైన విద్యార్థుల తత్త్వాన్ని అభివృద్ధిచేయుటలో సత్యసాయి బాలవికాస్ గురువులు ఎంతైనా పాటుపడగలరు. అభివృద్ధిని ఆశిస్తారు. శ్రమించి గొప్ప ఫలితాన్నికూడ దేశానికి అందిస్తారనికూడ నేను గాఢంగా విశ్వసిస్తున్నాను. ఈ విధమైన కార్యక్రమాన్ని ఈ నాడు మనం ప్రారంభించి, నేడు రేపు మనం చర్చించవలసిన చర్చల్లో సరియైనటువంటి నిర్ణయాలను తీసుకుని: ఆ నిర్ణయాలను కేవలము కాగితములో మాత్రమే చేర్చకుండా, ఆచరణలో ఉంచుటకై మీ రందరూ ప్రయత్నిస్తారని నేను ఆశిస్తూ. ఆశీర్వదిస్తూ నా ప్రసంగాన్ని విరమిస్తున్నాను.

శ్రీ వారి దివ్య బోధ. 20-11-79.

# మహమ్మదీయ దృక్పథంలో బాబా మహిమలు

ప్రశాంతినిలయంముందు ప్రతిరోజూ నిశ్శబ్దముగా స్త్రీ పురుషులు ఆ బాల గోపాలము బారులు తీరి గంటల కొలదీ వేచియుంటారు. ఓర్పుతో వారు దనాన్ని బలాన్నీ. బలహీనతనూ, అనారోగ్యమునూ మర్చిపోతారు. వేరు వేరు రంగాలనుండి వచ్చినప్పటికి వారిలో ఒక విషయంలో మాత్రం ఏకత్వం వుంది. వారందరూ తమ తమ స్వంతపనులను, గేటుబయట వదలి వేస్తారు. వారి హృదయములలో క్షణాలూ, నిమిషాలూ. గంటలూ నిర్విరామంగా గడుస్తున్నసంగతి స్ఫురణకురాదు. ఆశతో ఆకాంక్షతో అట్లా కూర్చునే యుంటారు. అట్లాంటి క్షణములో సన్నటి వూపిరి వదలిన శబ్దం సర్వత్రా వ్యాపిస్తుంది. ఒళ్లంతా కళ్లు చేసుకుని అంతా చూడనారంభిస్తారు. కాలంస్తంభిస్తుంది. కదలికలన్నీ నిలచి పోతాయి. కొందరుశ్వాస తీయడంలోకూడ మరుస్తారు.

'దైవం ప్రత్యక్ష మయింది'

దీనిని కొందరు "మాయాజాల" మంటే మరి కొందరు కాదు "కనికట్టు" అన్నారు. కానీ, యిస్లాం మత చరిత్రను కూలంకషంగా శోధించిన వండితుడికి యిదంతా లీలగా, దైవ కార్యంగా విదితమవుతుంది. మహమ్మద్ తదితర సూఫీ సంతుల

జీవిత కాలములలో, వారి ఆవరణల్లో యిటువంటి వుదాహరణలు అగుపించెడివి. ఆయా కాలాల్లో దేశాలనేలే చక్రవర్తులు వినయ విధేయతలుకూడగట్టుకుని ఆయా ఆవరణల్లో గౌరవంతో చేతులు కట్టుకుని దర్శనంకోసం నిలబడెడి వారు. మహిమ అనే పదం ఖురాన్‌లో లేనప్పటికిన్నీ దివ్యపురుషుల జీవిత కాలాల్లో సత్యాన్ని నిరూపించేందుకు వివరణ కసాధ్యమైన సంఘటనలగూర్చి ఖురాన్ ప్రస్తావించినది.

మహమ్మద్ ప్రవక్త ఒకసారి, ప్రతి దేవమాతకు, దివ్యపురుషుడికీ ప్రజలకు వారిపై నమ్మకం కలిగేటందుకు, తమ కార్యక్రమం విలువ తెలియజేసేందుకుగాను కొన్ని ప్రత్యేక శక్తులుంటాయని తెలిపిరి. ముస్లిం దివ్యపురుషులు వ్యాధులను తగ్గించటం, ఆపదలో వున్న తమ శిష్యులను చిత్రంగా ఆదుకోవటం పేదలను ఆకస్మికంగా సంపదలతో తులతూగించడం, లెక్కకు మించిన అసాధ్యమైన కోరికలను తీర్చి, వస్తువులను సృష్టించడం, చనిపోయారని ప్రకటించబడ్డ వ్యక్తులను పునర్జీవితులను కావించడంలాంటివి యిదే విధంగా చేస్తూ వచ్చిరి.

స్వామి మహిమల్లో మహమ్మద్ ప్రవక్త తదితర ముస్లిం యోగులూ చూపించిన దివ్యత్వం ముస్లింగా నాకు గోచరమవుతుంది. దానిని ఋజువు చేయడానికి ఉదాహరణం ఒక్కటి చాలు. చాలామంది భక్తుల యిండ్లలో స్వామి పటాలనుండి విభూతి, అమృతం, కుంకుమ వెలువడ్తూంటాయి. నా చిన్నతనంలో దైవానుగ్రహానికి సంబంధించిన యిట్లాంటి తార్కాణం ఒకటి చూచాను. ఇస్లాం మతప్రవక్త వెంట్రుక ఒకటి మా నాయనగారి వెలకట్ట బడజాలని సంపద. కొన్ని సంవత్సరాల పరిధిలో ఆ ఒక్క వెంట్రుక అనేక క్రొత్త వెంట్రుకలయి మెరుస్తున్న చిన్న నల్లటి కొప్పుగా రూపొందడం గమనించాను. విభూతి వెలువడడానికిగానీ, వెంట్రుకలు పెరగడానికిగానీ కారణాలూ, వివరణాలూ దొరకవు. వాటిని వ్యతిరేకించడంగానీ, అనుమానాస్పదంగా చూడ్డంకానీ, సత్యాన్ని విస్మరించడమే కాగలదు.

## చమత్కారమా? ఇంద్రజాలమా?

దైవలీలలను వింత మనసులున్న మనుషులు ఇంద్రజాలంగా ఆరోపిస్తున్నారు. స్వంతనగరమైన మక్కాలో మహమ్మద్ ప్రవక్త ఐంద్రజాలికుడిగా దుష్ప్రచారమునకు గురిఅయి ప్రజలనుండి దూరంచేయబడెను. ఇదే విధముగా స్వామినిగూర్చి కొందరు దుష్ప్రచారం సాగిస్తున్నారు. ఒక్కొక్కసారి సాయి భక్తులే వారి లీలలకచ్చెరువొంది " అవి ఎట్లా "అనీ " అవి ఎక్కడనుండి వచ్చినవనీ " వివరించడానికి వుద్యుక్తులవుతుంటారు. ఇట్లాంటి భక్తులు ప్రసిద్ధికెక్కిన యోగుల ఆత్మ కథలనొకసారి చదివితే సిగ్గుతో తలవాల్చవలసి వచ్చును. ప్రవక్త జీవితచరిత్రవ్రాసిన షిబ్లి "ఇంద్ర జాలమునకూ మహిమకుగల వ్యత్యాసంగూర్చి మహమ్మదీయ తత్వవేత్తలందరూ ఒక నిర్ధారణకు వచ్చిరి. చమత్కారములను దివ్యపురుషులు ప్రపంచముయొక్క మంచికి వినియోగించగా, ఐంద్రజాలికుడు స్వార్థ ప్రయోజనమునకు వాడు కొనును " అని వ్రాసిరి.

ముస్లిములు మహిమలను దైవకార్యములుగను, ఇంద్రజాలమును శారీరక మానసిక పరిస్థితుల ఫలితముగాను భావించెదరు. చమత్కారము మానవులలో విశ్వాసము గట్టి పరచి సత్యాన్ని అభివృద్ధి గావించడానికి ఉద్దేశింప బడితే, ఇంద్రజాలము వారిలో అహంకారము పెంచడానికి తోడ్పడ్తుంది. చమత్కారమును ఇంద్రజాలముగా భావించడమే అహంకార లక్షణము.

మహిమలను అనుమానించుట యింకా నీచము. ఇస్లాం పదజాలంలో దానిని 'వంచన' అంటారు. ఖురాన్ అట్టి వారిని నాస్తికుల చేరువకు "సత్యం వచ్చిన పుడు వారు దానిని ఇంద్రజాలముగా పరిగణించెదరు" అని ఖండించును.

క్రీస్తు, మహమ్మద్, సాయిబాబాల జీవితములు మహిమల విలువను ఋజువు చేయును. వారు తమ జీవితములను సత్యమున కర్పించిరి. వారు మానవ హృదయం శోధనం చేయుటకు పాటుపడెదరు. మానవ సాధ్యంకాని ఆయా కార్యములు వారి భక్తుల జీవితము లను, భావములనూ, మార్చును. వారి సందేశం, వారి జీవితసత్యాన్ని మాటల్లోను, చేతల్లోనూ తెల్పుతాయి.

మహిమ అనుగ్రహ లక్షణం

ముస్లిం ప్రజానీకం మహిమను సర్వ శక్తివంతుడై న అల్లాచెంతకు వేయు మొదటి అడుగుగా గుర్తించింది. ఖురాన్‌లో "భగవంతునికి సర్వముపై అధికారం కలదు" అనే మహావాక్యం ఎనిమిది సార్లు చెప్ప బడింది. ఈ వాక్యమునే బాబా శబ్దం, కాలం, దేహ బలం, మానవ హృదయం భగవంతుని పూర్తి అధీ నంలో వుంటాయనీ వివరించి బలపరచిరి. మానవ కోటికి లాభము కలుగ చేయు మహిమలు దైవానుగ్ర హమునకు ప్రతీకలనిన్నీ, భగవంతుడు అందజేయు గుర్తింపు కార్డులనిన్నీ బాబా వివరించిరి

మానవ స్థాయిలో చరిత్రకారులు సామాన్య మాన వుని నమ్మకముపై పని చేయు ఈ దైవంయొక్క చిహ్నములను రెండురకములుగా విభజించిరి. దైవ త్వమును తెలియచేయుటకొనర్చుమహిమలు మొ దటి రకముకాగా, భక్తులకు సహాయము చేయుటకు చేయు మహిమలు రెండవరకము. మహమ్మద్ ప్రవక్త ఇస్లాంమతమును తొమ్మిదివత్సరములు బోధించిన పిదప ఒక అసామాన్య సత్యాన్ని నిరూపించుటకు చూ పుడు వేలును చిన్నగా కదల్చి పూర్ణచంద్రుణ్ణి రెండు ఖండములుగావించిరి. ఖురాన్‌లో ఈ మహిమను గూర్చి పరోక్షముగా ప్రస్తావించబడింది. సంవత్సర ముల తరబడి బాబా మహాశివరాత్రి పర్వదినములందు లింగాన్ని వెలువరించేవారు. ఈ విషయముగూర్చి స్వామి "దైవాన్ని అర్థము చేసుకొనుటకూ, దైవ శక్తిని కొలుచుటకూ, దైవము ప్రత్యక్ష నిదర్శనము లను తెలుసుకొనుటకూ మీకసాధ్యము. మీ మధ్యలో దైవము వున్నాడనే విషయం తెలియజెప్పుటకు నా లక్షణములను ఇట్లు చూపించెదను" అని తెలియ జేసిరి. డా. ఫని బండాగారి "విజన్ ఆఫ్ ది డి వైన్" అనే పుస్తకములో స్వామినుండి ఆవిర్భ వించిన జ్యోతిర్లింగం చిత్రము ప్రచురించిరి. అందు ముదురాకు పచ్చపై పొదగ బడిన చంద్రరేఖ, దాని నడుమ నక్షత్రం (ఇస్లాం మత చిహ్నం) స్పష్టంగా కన్పట్టును. బెండు బారిన హృదయం మాత్రమే దానిని దైవముయొక్క చిహ్నముగా గుర్తింప జాలదు. స్వామి స్పర్శకు పాత్రులు కాకపోగా విలపించిన చీరలు చెమర్చిన సంఘటనయూ, మహమ్మద్ ప్రవక్త తమ నానుకొని కూర్చొనలేదే అని చంటిపాపమాదిరి వెక్కి పెట్టి ఏడ్చిన మసీదు స్తంభములను ప్రత్యక్షముగా గమ నించిన వారు కలరు. ఇటువంటి సంఘటనలు భగ వంతుని అనుగ్రహానుభూతుల నొందుట కర్హతే లేని వారి పట్ల దైవం చూపిన నిరంతర ప్రేమకు, దయకు నిదర్శనములు.

భక్తులకు సహాయం చేయుటకుద్దేశించి చేయబడిన మహిమల లక్ష్యం, వాటి తీరు తెన్నులూ అర్థంచేసు కోవడం కష్టమే అలీ అనే అతని అంధత్వము, బల

హీనములయిన కాలు చేతులను మహమ్మద్ ప్రవక్త నివారణ చేయుట యిందులకొక ఉదాహరణ. అదే యువకుడు ఏడవ హిజ్రీలో జరిగిన ఖైబరు యుద్ధములో విజయము సాధించి, ఏడుగురు మనుష్యులకు సాధ్యముకాని యినుప తలుపును ఒక చేతితో సునాయాసముగా తెరువ గల్గినంత బలాఢ్యునిగా మారెను. హైదరాబాద్‌లో పోలియోవ్యాధికి గురయిన ఒక యువకుడుండెను. ముస్లిమ్ ఫకీరొకని సలహాచే పుట్టపర్తి పోయి భగవాన్ వారి కృపకు పాత్రుడయి దేహదారుఢ్యము తిర్గి పొందిన ఆతడీనాడు హైదరాబాదు నందలి ప్రముఖ న్యాయవాదులలో ఒకరు.

చనిపోయిన వారు తిర్గి జీవించరనేది అనుభవైకవేద్యమే. అయితే చనిపోయినాడని ప్రకటించబడ్డ వాల్టర్ కోవాన్ అనే స్వామి భక్తుడు పునర్జీవించుట చాలా మందికి తెలియును. అదేరీతిన, క్రీస్తువెనుక తొమ్మిదవ శతాబ్దములో షేక్ అబ్దుల్ ఖాదర్ యులానీ వరదలో మునిగి చనిపోయిన దంపతులను పునర్జీవితులను గావించెను. భగవంతుడి కసాధ్యమైనది లేదని ఖురాన్‌లో చెప్పిన విధముగా ప్రకృతి సిద్ధాంతములకు మహాపురుషులు అతీతులు. దైవము చేయు ప్రతిచేతా ఆశ్చర్యము కలిగించును. వారు చేయు ప్రతి కార్యమూ, వేయు ప్రతిఅడుగూ పై బాధలను తగ్గించడమే కాక, క్రుంగిన హృదయములను లేవనెత్తును. స్వామి చిన్న స్పర్శ అంతులేని విభూతి ధారలను వుత్పత్తిచేయును. వేలాది భక్తులకొరకు సున్నితమైన వ్రేళ్ళనుండి అమృతంస్రవిస్తుంది. మహమ్మద్ ప్రవక్తకూడ తన హస్తస్పర్శచే కాలినభాగములను, తగిలిన గాయములనూ మాన్పిన సంగతి చరిత్రకారులు తెలియచేసిరి. అంతేకాక వారు దాహంతో బాధపడ్తున్నవారికొఱకు తమ వ్రేళ్లనుండి అంతులేని నీటిధారలను సృష్టించిన విషయము ప్రవక్త జీవితచరిత్రలో షిబ్లి తెలిపిరి.

భక్తుల నమ్మకం దృఢపరుచుటకు వారికి ఆహ్లాదం అందించుటకు చూపు మహిమలు యిట్టివే. స్వామి ఒక అమెరికాదేశస్తుడికి, కాలంకాని కాలంలో అత్తిపండు సృష్టించినవిషయం శ్రీమర్ఫెట్ తనగ్రంథంలోప్రస్తావించిరి. ఇదేతీరుకథను క్రీస్తువెనుక తొమ్మిదవ శతాబ్దపు సాధువు ఆల్‌హల్లాజ్‌గురించి చెప్పెదరు. వారి శిష్యులు ప్రయాణంలో ఒకసారి అత్తిపండ్లను కాంక్షించగా ఆయన లేచి నిలబడి తనముచెట్టుకొమ్మను కదిలించినట్లు వూపమనిరి. ఎల్లరనూఆశ్చర్యచకితులనుగావిస్తూ చెట్టునుండి రాలినట్లు అత్తిపండ్లు వారిముట్టూరాలెను. అయితే మహిమననుభవించుటకు సరయిన చోటు దైవం నివసించేహృదయమేకాని బహిర్ప్రపంచంకాదు. స్వామి తనదృష్టితోనో, ఒకమాటతోనో, ఒకఆలోచనతోనో హృదయముల మధ్యవున్న సంబంధంగూర్చి నొక్కిచెప్పి మనుష్యులనుమార్చిన సందర్భములనేకములు. మహమ్మద్ ప్రవక్తను చంపుటకు వచ్చి ఖురాన్ పఠనంవిని హృదయపరివర్తనచే సేవకులయినవార సంఖ్యాకులు.

దైవ సహాయమునకు కాలమూ, దూరమూ అడ్డంకి కానేరవు. పంజాబ్‌లో బాబా ఫరీదుశకర్‌గంజ్ జీవిత చరిత్రలో, ఆయోగి ఒకబ్రాహ్మణశిష్యుడు నగుబాటు కాకుండా కాపాడినవిధమును రచయిత రాంగోపాల్ తెలియచేసిరి. బ్రాహ్మణుని కుటుంబం బాబాఫరీద్ ఆదేశం వలన ఎన్నోసంవత్సరములు ఆయన సమాధివద్ద శాకాహార నైవేద్యమునమభవించెడిది. అసూయాపరులైన సమాధి ధర్మకర్తలు ఒకరోజు ఆబ్రాహ్మణునికి మిఠాయి బదులు మాంసపుముక్కలప్రసాదమిచ్చిరి. అమాయకుడయిన ఆభక్తుడ్ని మాయపన్నిన ధర్మకర్తయొకడు ఆపి విందించ నారంభించెను. వాగ్వివాదం కొంతజరిగిన పిదప గంపమీదిమూతను తొలగించి

చూడగా మాంసము బదులు దాని నిండుగ అడ్లుకన్పడెను. దీనితో పోలిస్తే 1979లో సిరియన్ రాజకుమార్తె స్వామిచే దారి చూపబడి పుట్టపర్తి చేరడంలో ఆశ్చర్యమేల ? భారత దేశము చేరకమునుపామె స్వామికృపకు, అనుగ్రహానికి చాలా పాత్రురాలయ్యెను. దీనికి ఎవరు అర్థంచెప్పగలరు ? ''భగవంతుడు తనను నమ్మిన వారికి సహాయము చేసెదనని అభయమిచ్చెను" అను ఖురాన్ వాక్యమే దానికి జవాబు.

''నేను మిమ్మల్ని కంటిరెప్పమాదిరి రక్షిస్తాను. మీతో వెంటగా జంటగా, లోపలావెలుపలా, యిప్పటికీ మరెప్పటికీ వుంటాను'' అనిస్వామి నిర్ద్వందంగా తెలిపిరి.

అన్నిటికంటె గొప్ప లీల.

అవతారముకానీ, ప్రవక్తకానీ. చూపేగొప్పమహిమ ఆతనివ్యక్తిత్వమే ! మనిషి బలహీనమైన ఆకళింపుశక్తి మానవ స్థాయినిమించి ఎదుగజాలదు. ఈలోపాన్ని సూచిస్తూ స్వామి ''నేను మీతోపాటు తింటూ, మాట్లాడుతూ, తిరుగుతుండుట వలన మీరుఈ రూపమును నమ్మి మాయలోపడెదరు. అయితే నా దైవత్వం ఏక్షణం లోనైనా మీకు ప్రత్యక్షం కావచ్చు. ఆక్షణం కోసం మీరు సిద్ధంగావుండాలి" అంటారు. ఖురాన్‌లో ఒక చరణం ఈరకమైన బలహీనత గమనించమని చెపుతుంది. "ఒక పూర్తిజీవిత కాలం నేను (మహమ్మద్) మీమధ్య తిరిగితిని. నన్ను అప్పటికీ అర్థం చేసుకొనలేదా?''

చాలా కొద్దిమందివ్యక్తులు దైవాన్ని ఎట్టి సహాయము లేకుండగనే గుర్తు పట్టకలిగెదరు. అట్టివారికి అవతారమునకుచెందిన ప్రతి విషయమూ మహిమయే. వారు అరవిందాక్షుడి అనుపమానమైన నేత్రసౌందర్యంలోను, దేవదేవుని శ్రావ్యమైన సన్నని కంఠస్వరంలోను, పరమాత్ముని ప్రేమపూరితమైన సత్యాన్ని అందించే ప్రతి సందేశంలోను మహిమను చూడకలిగెదరు. మహమ్మద్ ప్రవక్తను మొట్టమొదట గుర్తించి నమ్మిన ఖదీజా ఆయన నడవడికలోగల స్వచ్ఛతలో దైవత్వాన్ని చూసెను. ప్రవక్తముఖ్యానుయాయులు అలీ, అబూ బేకర్. ఉస్మాన్‌లు ఆయన నిత్యజీవితంలో దైవాన్ని గుర్తించిరి అబిసీనియారాజు నజ్జాషి ఖురాన్ పఠనం ద్వారా సాక్షాత్కారం పొందెను. కరణం సుబ్బమ్మ, మహబూబ్‌ఖాన్ అనే బడిపంతులు ఏడేళ్ల సత్యనారాయణరాజుపై చూపిన ప్రేమకు, ఆనాటి పండరి భజన మండలి పిల్లలు తమ బుజ్జిగురువు పట్లచూపిన శ్రద్ధా భక్తులతోపాటు కల్గియున్న విశ్వాసమునకు కండ్లకు కనపడు పదార్థసంబంధమైన మహిమలు కారణంకావు. అవన్నీ స్వామి తనపద్నాలుగవ సంవత్సరమునందు "నేను సాయి బాబాను" అని లోకానికి తెలియచెప్పక ముందు జరిగిన సంఘటనలు, వారివారి భక్తి దైవం యొక్క ఆకర్షణ ఫలితం. పర్షియాదేశపు సాధువు రూమీ "సత్యము నెరిగిన హృదయమునకు ప్రవక్త మాట, ముఖము కూడా మహిమయే'' అన్నారు.

దీనికి విరుద్ధంగా సత్యమును నమ్మక, నిజమును గమనించని వారూవున్నారు. వారిఅహంకారము వారిని నమ్మనివ్వదు. ఖురాన్ అట్టివారినే గర్వాంధులని వివరించింది. ''ధర్మ విరుద్ధముగా గర్వంతో భూమిపై సంచరించువారిని నా అనుభూతులకు దూరంచేసెదను. వారు వాటిని చూచినప్పటికీ నమ్మజాలరు" అంటూ వారిని క్రూరులనీ అజ్ఞానులనీ చిత్రీకరించింది ఖురాన్. ''ఎవరు మహిమలనర్థము చేసుకొనలేరో ఎవరు తమ ఇంద్రియ సుఖములననుభవించుటలో ఆసక్తి చూపెదరో వారి హృదయములను భగవంతుడు కరడు గట్టించును." అట్టిదౌర్భాగ్యులకు ఖురాన్ పదజాలంలో ''దైవ మార్గము'' లేక ''సనాతనుల (ప్రవక్తల) మార్గము''

ఒక్కటేదారి. సామాన్యభాషలో దీనినే భవిష్యద్వాణిగా చెప్పబడింది. ప్రపంచ చరిత్రలో భవిష్యద్వాణిలో చెప్పబడి నిజంగా జరిగినసంఘటన లెన్నియోకలవు.

ఇట్టి చిహ్నములలో అంతర్లీనమయినశక్తిని అజ్ఞానులు మాత్రమే నిర్లక్ష్యంచేసెదరు. ఆశక్తి ప్రేమయే. ఖురాన్ మహిమ లన్నిటినీ ఈదివ్యత్వం యొక్క అంశములని సూచిస్తూ "నేను దాచబడిన పెన్నిధిని నన్ను నేను తెలియ చేయాలనే వుద్దేశ్యంతో ఈప్రపంచమును సృష్టించాను" అని వివరిస్తుంది. సూఫీ సిద్ధాంతము దీనినే భిన్నత్వములో ఏకత్వమనీ సర్వము ప్రేమమయమనీ చెప్పును. మహనీయులకంతా భగవన్మయమే సకలసృష్టికీ పరిణామమునకూ ఈప్రేమేమూలాధారము. ఈకోణములో చూచిన ప్రతి లీలా, ప్రతిమహిమా దివ్యప్రేమనుంచి ఆవిర్భవించినట్లు గోచరమగును. "బాబా తనప్రేమతో మనలను వారిదిశకు ఆకర్షించుటకెట్లు వినియోగింతురో, మనచెడును ఖండించుటకూ ప్రేమనట్లే వుపయోగింతురు" అన్న శ్రీ కస్తూరి వాక్యం నిజము.

పరిమితమయిన మానవశక్తికీ ప్రేమనర్థము చేసుకొనుటకానీ, మహిమలను తెలుసుకొనుటకానీ అసాధ్యము. ఎక్కువ కెక్కువ స్వామి ప్రేమ మూర్తిఅనీ, ప్రేమికుడనీ ప్రేమించబడువారనే మహత్తరమైన సత్యమును నమ్మకలుగును. ఖురాన్ చూపిన "సరయిన మార్గము" లో పోవుటయే భక్తునికి ముక్తి మార్గము.

"నన్ను నీవు బంధించుటకు ఒకే ఒకసూత్రము, ప్రేమ. అదినీకు శాంతిని చేకూర్చి స్వాంతనమిచ్చును. నిన్ను నాలో ఐక్యము చేయుటకు ఉత్సాహపరచును"

శ్రీమతి జిబాబషిరుద్దీన్

# దేహము — దేహి

సకలశాస్త్ర పురాణ - సంగ్రహ వేత్తయై
వేదాంత వేద్యుడౌ - విబుధుడైన
రక్తియేపారగ - రమ్య హర్మ్యంబుల
రమియించు రాజచం-ద్రముడునైన
రణరంగమందున - రాభూతరిపుడౌచు
వెలుగొందు జగదేక - వీరుడైన
దారిద్ర్య దేవత - దాక్షిణ్యమునగుందు
దౌర్భాగ్యనిధియగు - దాసుడైన
భక్తిలేనిచో ఎందుకు - పనికిరాదు
భక్తిరహితుడౌయా జగ - ద్భర్తకన్న
భక్త పరుడగు దాసుదే - వంద్యుడగును.
ఇంతకంటెను వేరెద్ది - ఎరుకపఱతు

ప్రేమస్వరూపులారా! దేహము, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, మానవుడు ధరించినటువంటి వస్త్రములవంటివి; ఉపాధులు. ఈ ఇంద్రియములయొక్క తత్త్వాన్ని మనం చక్కగా గుర్తించినప్పుడే వీటిని వశం చేసుకునే విధానము మనకు అర్థమవుతుంది. ఈ దేహేంద్రియ మనోబుద్ధుల రహస్యాన్ని ఏనాడు మనం గుర్తించకుండా ఉందుమో, ఆనాడే మనకు అన్నివిధ

ములైన ఇక్కట్లు ప్రాప్తిస్తాయి. వీటి రహస్యాన్ని గుర్తించనంతవరకు మనం ఇంద్రియములను ఏ మాత్రమూ వశం చేసుకొనలేము. కనుక ప్రప్రథమంగా ఈ దేహేంద్రియ, మనోబుద్ధుల రహస్యాన్ని గుర్తించుటకు మనం ప్రయత్నించాలి. ఈ దేహము, మనం, మరణించినతరువాత దహింపబడునది మాత్రమే కాదు. జీవించినంతవరకును చింత అనే చితిలో మనం భస్మమై పోతున్నాము. కేవలము దేహమును మాత్రమే ఈ చింత భస్మము గావించునది కాదు. అనేక విధములైన సంకల్పములను కూడ భస్మము చేయుచున్నది.

కనుకనే ' దహ్యతీతి దేహః ' అని ఈ దహింపబడునట్టిది, దహింపజేసేట్టిది ఈ దేహము అనే సత్యాన్ని మనం గుర్తించాలి. "శీర్యతీతి శరీరః" అని. ఈ శరీరమను నట్టిది. జీర్ణింపచేయునట్టిది జీర్ణించేది. కనుక దీనికి శరీరము. అని మరొక పేరు. ఈ శరీరము రక్తపుముద్దగా ఏర్పడి, తదుపరి కోమలమైన బాల్యముగా అభివృద్ధియై. ఆకర్షింపబడు యౌవనముగా తయారై, వృద్ధాప్యము నందు అనేక వికారములు చెందుచున్నది. కనుక అనేక వికారములు చెంది జీర్ణించు శక్తికలది జీర్ణింపచేయు శక్తికలది కనుక దీనికి శరీరమని పేరు వచ్చింది. ఈ శరీరమునకు అద్దెకొంప అనికూడ మరొక పేరు. ఇది కేవలము ఒక అద్దె గృహముగా తయారై, కొంతకాలము మాత్రమే ఈ గృహమునందు ఆత్మ నివాసము సలిపి, తద్వారా మరణమనే ' రెంటు ' చెల్లించి, పోవుచున్నది. ఈ బాడుగ ఇంటి సమాచారము అందరికీ తెలిసిన విషయమే. బాడుగకున్న వ్యక్తిని వదలించే నిమిత్తమై అనేకవిధములుగా ప్రయత్నములు సలుపుతూంటాడు యజమాని. ఎప్పుడు ఈ బాడుగకున్న మనిషిని ఈ యింటినుండి తరమడానికి ఈ యజమాని ప్రయత్నిస్తాడు? బాడుగ సరిగా ఈలేని సమయము నందు. లేక తక్కువగా ఇచ్చేసమయమునందు, గృహమును అనేక విధములుగా అశ్రద్ధగా అలక్ష్యంగా చూసుకున్నప్పుడు ఈ యజమాని ఆ బాడుగకున్న వ్యక్తిని పంపించుటకు ప్రయత్నిస్తూంటాడు. కనుక ఈ మరణమనే స్థితి మనకు రాకపూర్వమే. సక్రమమైన మార్గమునందు మనం ప్రవేశించి. సరియైనటువంటి రీతిగా దేహమును పోషించుకుని, తద్వారా యజమానిని సంతృప్తిపరచే విధంగా మనం ప్రవర్తించుకున్నప్పుడు, దీని యజమాని ఇందులో బాడుగకున్న వ్యక్తిని గౌరవమర్యాదలతో చూస్తూంటాడు.

అనగా అనేక జన్మముల పుణ్యఫలమును ప్రోగుచేసుకుని సంపాదించుకున్న గృహము ఈ దేహము. దీనినే సంసారమను సాగరమును దాటుటకు ఒక పడవగా కొంతవరకు ఎన్నుకున్నారు. ఈ పడవ చిల్లులుపడి శిధిలము కాకపూర్వమే ఈ సంసారమను సాగరమును దాటుటకు ప్రయత్నించాలి. కనుక ఈ దేహమును పవిత్రమైనదానినిగా భగవద్గీత ప్రబోధిస్తూ వచ్చింది. ఇదియే క్షేత్రము అనికూడ పిలువబడుతూ వచ్చింది. క్షేత్రమనగా రెండు అర్థములు కలవు. భూమి అని ఒకటి. పుణ్యప్రదేశము అని మరొకటి. ఇక్కడ భూమినిగా మనము విశ్వసించినప్పుడు ఈ భూమియందు ఏ విత్తనము నాటుదుమో ఆ పంటనే అందుకొనుటకు సంసిద్ధముగా ఉండవలసివస్తుంది. ఈ దేహమనే క్షేత్రమునందు అనగా భూమియందు పాప విత్తనములు వేసుకున్నప్పుడు పాప ఫలమునే మనము అనుభవింప వలసివస్తుంది; పుణ్యవిత్తనములు చల్లుకున్నప్పుడు పుణ్యఫలమునే మనము గ్రహింప వలసి వస్తుంది.

ఇక్కడ ఈ క్షేత్రమునకు యజమాని జీవుడు.

కనుక జీవుడు ఈ క్షేత్రమునందు ఏ పంటను పండిం చు కోవాలి, ఏ ఫలమును అందుకోవాలి అనే విచారణ చేయడం అత్యవసరం.

ఇంక క్షేత్రము అనే రెండవ అర్థమునందు కాశీ క్షేత్రము, ప్రయాగక్షేత్రము, ఈ విధమైనటువంటి పవిత్రమైన దివ్యస్థానములకు క్షేత్రములనికూడను పేరు వచ్చింది. కనుక ఈ క్షేత్రమనే రెండవ అర్థము నందు ' దేహోదేవాలయ ప్రోక్తో జీవో దేవస్సనాతనః' సనాతనుడైన ఈశ్వరుడు నూతనమైన దేహమునందు పురాతనుడైన జీవుడుగా ఇందులో పేర్కొనబడుచు న్నాడు. కనుక ఈ దేహమును భగవంతుని మందిర ముగాకూడా మనము విశ్వసించాలి. ఈ దేహమనే మంది రమును అనేకవిధములుగా పరిశుభ్రపరచి, పవిత్రం గావించుకోవాలి. పరిశుద్ధము అనగా దినమునకు పది పర్యాయములు స్నానం చేసి 'ముట్టవద్దు' 'ముట్ట వద్దు' అను మూఢాచారములలో మునుగునది పరిశుద్ధం కాదు. పరిశుద్ధమనగా కేవలము జలముచేత మాత్రమే మన దేహమును పవిత్రము గావించుకోవడము కాదు. ఈ దేహమును నాలుగు విధములుగా పరిశుద్ధము చేయ వలసి ఉంటున్నది. జలముచేత దేహమును, సత్యము చేత వాక్కును, విద్యా తపస్సులచేత జీవుని, జ్ఞానము చేత బుద్ధిని పరిశుద్ధము చేయవలసియున్నది. ఈ నాలుగు విధములైన పరిశుద్ధములు గావించుకున్నపుడే ఈ దేహమనే దేవాలయము పరిశుద్ధమై పవిత్రముగా రూపొందుతుంది. కనుక పైజెప్పిన విధంగా ఏనాడు మనం పరిశుద్ధంగావించుకొందుమో ఆనాడే అంతఃకరణ పరిశుద్ధముకలిగినవాడు అనే సార్థక నామాన్ని అందు కొంటున్నాడు. కనుక దేహమనే దానిరహస్యాన్ని మనం ఇన్నివిధములుగా విచారణ సలపాలి. ఏతావాతా ఈ రహస్యాన్ని మనం గుర్తించుకున్న తరువాతదేహము 'తాను' కాదనే సత్యాన్ని గుర్తించు కొంటాము. దేహమే 'నేను' అనే భ్రాంతి చేతనే మానవుడు ఇన్ని విధముల దుఃఖములకు గురి అవుతున్నాడు. కనుక దేహరహస్యాన్ని మనం ఈ రీతిగా విచారణ సలిపి గుర్తించుకున్నప్పుడు ఈ దేహభ్రాంతులు మనలను హింసించక, ఏవిధమైన దుఃఖములకు, విచారములకు గురికాకుండా నిరంతర ఆనందమును అందుకునే అవ కాశం ఏర్పడుతుంది.

ఇంక ఇంద్రియములు అనే దీనిని కొంతవరకు మనం విచారించాలి. ఇంద్రియములకు 'మాత్రః' అని మరొకపేరు. 'మాత్రము' అనగా కొలత అని అర్థము. ఇది ఏవిధమైన కొలత? ఒక చిన్న ఉదా హరణము. పప్పులో ఉప్పు తక్కువ, లేక, ఎక్కువ అనేవిషయాన్ని మనం విచారణచేస్తాము. అయితే ఈ ఉప్పు యొక్క ఎక్కువ తక్కువలను తెలుసు కొన్నది నాలుక. కనుక దీనికి 'మాత్ర' అనిపేరు. ఈ మనిషి చాలా అందంగానే ఉంటున్నాడు. కానీ, ముక్కు మాత్రం కొంచెం చిన్నది అని నిర్ణయం చేస్తుంది కన్ను. మనిషి యొక్క అందచందాలు నిర్ణయించే కొలతబద్ద ఈ కన్నులు. ఆహా! ఈ సంగీతం ఎంత శ్రావ్యంగా ఉంటున్నది, ఎంతశ్రవణా నందంగా ఉంటున్నది. లేక ఈ సంగీతం ఎంత కర్ణకఠోరంగా ఉంటున్నది అని నిర్ణయించే కొలబద్దలు మన చెవులు. ఇంక నాలుగోది ఇది దుర్వాసన, ఇది సువాసన, అని కొలతవేసే ఇంద్రియము మన ముక్కు. ఈవిధముగా మనదేహము నందున్న సర్వ ఇంద్రియము లూ ఒక్కొక్క విషయమునందు కొలబద్దలుగా తయారవుతూన్నవి.

ఇక్కడ 'మాత్రము' అనే దానికి మరొక అర్థము గూడ ఉన్నది. పరిమితి, అనగా ఒక్కొక్క ఇంద్రి యాన్ని ఒక్కొక్కమార్గము నందు పవిత్రముగాపించు

కనే నిమిత్తమై పరమాత్ముడు అందించినాడు. కానీ అన్ని విధములా పరిమితికిమించి, మితిమీరిన మార్గములో ప్రవేశించుటకు కాదు. అనే సత్యాన్ని ఈ మాత్ర తత్త్వం మనకు ప్రబోధిస్తూ వచ్చింది. ఏవిధమైనటువంటి పరిమితికి లోనై ఈ ఇంద్రియాల్ని భగవంతుడు అందించినాడో, ఆ పరిమితికిమించి మనం ఉపయోగ పెట్టుకున్నప్పుడు భగవదాజ్ఞను ఉల్లంఘించిన వారమవుతాము. ఈ నాడు మనకు భగవంతుడొసంగిన ప్రతి ఇంద్రియము కూడ పరిమితి విధానం గుర్తించుకొనలేక పోవడం చేత దీనిని దుర్వినియోగపరుచుకునే మార్గాన్ని మనం అవలంబిస్తున్నాము. ఒక చిన్న ఉదాహరణము. నాసికఉన్నది. దీనిద్వారాశ్వాసనుపీల్చుకొనుట దుర్వాసన సువాసన అనేదానిని నిర్ణయముచేయుట చేయుచున్నాము. కానీ! మనము పైవిధముగా చేయుట మాత్రమేగాక నస్యమును పీల్చుకొంటున్నాము. ఇది ముక్కుద్వారా మనంచేసెడి ఒక దుర్వినియోగం. ఈ విధముగనే మనకునాలుకను భగవంతుడిచ్చినది సాత్విక ఆహారమును రుచిచూచేనిమిత్తము, మధురవాక్కును పలికేనిమిత్తము. మృదుమధురముగా సంభాషించే నిమిత్తము మనకు ఈ నోటినిచ్చాడు భగవంతుడు. అట్లుకాకుండా రజోగుణ, తమోగుణ పదార్థాన్ని భుజించుట, మత్తుపదార్థాన్ని స్వీకరించుట, అనువాటితో దుర్వినియోగపరచినట్లుగా మనముతెలిసికోవాలి. ఇదేవిధముగాప్రతిఇంద్రియమునూ, ఒక్కొక్క నిర్ణయాన్ని, ఒక పరిమితిని, ఒక హద్దును నియమించి భగవంతుడొసంగినాడు. ఈ ఇంద్రియాలను మనము మితిమీరి ఉపయోగించుకొంటున్నాము. ఈ విధముగా ఉపయోగించుకొనుటయే కొన్ని దుఃఖములకు మూలకారణమని కూడ నిరూపించవచ్చు. ఈ విధమైనటువంటి రహస్యాన్ని గుర్తించుకునే నిమిత్తమై ఇంద్రియములకు 'మాత్రః' అని ఒక పేరు పెట్టారు.

ఈ ఇంద్రియ దేహములతో కూడిన తత్త్వము జడమైనది. ఏతావాతా దీని రహస్యాన్ని, చక్కగా గుర్తించుకుంటే దేహము జడము. ఈ దేహమే జడమైన ఇది పెరుగుతూ తరుగుతూ ఉన్నది కదా! ఈ పెరుగుతూ తరుగుతూ ఉన్నటువంటి తత్త్వము ఒక చైతన్యతత్త్వమేకానీ జడము కాదు. అని మనం ఊహించవచ్చు. జడము పెరగదు అనేవిషయము మీరు ఏమాత్రము ఊహించకూడదు. ప్రతిదినమూ మనము ఇంటిని ఊడ్చి ఇంత చెత్త తీసుకొనిపోయి ఒకచోట వేస్తుంటే అది దిబ్బగా పెరుగుతుంది. ఆదేవిధముగనే; మనము నిత్యమూ కాఫీ, టిఫిన్, ఫలహారము, భోజనము, డిన్నరు ఈ విధమైన చెత్తను వేస్తుంటే ఈ దిబ్బ కూడా పెరుగుతూనే ఉంటున్నది. ఏనాడు ఈ చెత్తను మనం మానుదుమో, ఆనాడు ఈ దిబ్బ కూడనూ విలచిపోతుంది. కనుక ఈ రహస్యాన్ని మనం చక్కగా తెలిసికొంటే ఇదికేవలం జడమైనది; తప్ప ఇది చైతన్యవంతమైనటువంటిది కాదు.

ఇక మూడవది మనస్సు. 'మననాంతు మనః' అని మననము చేసేది మనస్సు. సంకల్ప వికల్పాత్మకము మనః అని. సంకల్ప వికల్పములతో కూడినది మనస్సు. క్షణకాలమైనా సంకల్పములు లేకుండా ఈ మనస్సు ఉండుటకు వీలుకాదు. రాత్రినిద్రవచ్చేంతవరకు కూడ ఈ మనస్సు ఏవో కొన్ని సంకల్పములు చేస్తూనే ఉంటుంది. ఏకాంతముగా నున్న సమయమునందు కూడా మనస్సు సంకల్పాన్ని సృష్టించుకొంటూంటుంది. కనుక ఈ సంకల్పములనేవి ఒక్కొక్కపర్యాయము తీవ్రమైన స్థితిని అందుకుంటాయి. అప్పుడే ఈ మనస్సు గతి తప్పిపోతుంది. ఈ ఉద్రేకానికి తట్టుకొనలేక ఒకవిధమైన అస్తవ్యస్తమార్గమును అవలంబిస్తుంది. ఈ సంకల్పముల యొక్క వేగము చేత ఒక విధమైన పిచ్చివారుగా కూడా తయారయిపోతున్నారు.

కనుక ఈ మనస్సంకల్పములను కొంతవరకు అణగ ద్రొక్కుటకునే నిమిత్తమై, ధ్యానమును నిరూపిస్తూ వచ్చారు. మనస్సుకు ప్రత్యేకించినట్లుగా పంచభూతాత్మకమైన స్వరూపము లేదు. ఇది కేవలసంకల్పముల కూడికయే! ఏనాడు నిస్సంకల్పులమై మనం జీవింతుమో ఆ స్థితియే పవిత్రనిర్వికల్పము. నిర్వికల్పమనగా కేవల సంకల్పరహితస్థితియే। ఆ నిర్వికల్పస్థితియందు మానవుడు ఆనందస్వరూపుడుగా నిరూపింపబడుతూం టాడు. అయితే ఎప్పుడు మనం నిస్సంకల్పులమై జీవిస్తున్నాము మన జీవితములో ? గాఢనిద్రియందు నిస్సంకల్పులముగా మనం జీవిస్తున్నాము. ఈ గాఢ నిద్ర తరువాతఎంతఉల్లాసంగా, నిర్మలంగా, నిశ్చలంగా, పవిత్రహృదయంతో మనము ఆనందాన్ని అనుభవిస్తుం టాము. ఏతావాతా మనము ఆనందమును ఎట్టిస్థితి యందు అనుభవిస్తున్నామనగా గాఢ నిద్రయందు అను భవిస్తున్నాము. గాఢనిద్రయనగా సంకల్పరహితమైన స్థాయి; స్థితి.

ఎప్పుడు మనోవికారములు లేకుండా ఉండునో అదే మనకు ఆనందమునకుమూలాధారము, కొన్ని క్షణముల గాఢనిద్రయందే ఇంత ఆనందానికి మనం అర్హులమై నప్పుడు, నిరంతరము ఈ సంకల్పరహితస్థితిని అభివృద్ధిగావించుకున్నప్పుడు, మనమునిరంతరానందాన్ని అనుభవించుకోవడంలో ఎట్టిసందియము ఉండదు. కాన ధ్యానమనగా సంకల్పములను అరికట్టేవిధానమే! ఎప్పుడు ఈ సంకల్పములను పూర్తిగా మనం అరికట్టు దుమో అదే నిత్యానందమునకు ఒక అవకాశము. కను కనే "భావాతీతం, త్రిగుణరహితం" అన్నారు. ఆనంద స్వరూపాన్ని కనుక గురువులు తాము దినము కొక్క పర్యాయమైనా తాము సంకల్పరహితులయ్యే పవిత్ర స్థాయిని చేరుటకు ప్రయత్నించాలి. అప్పుడే గురువులు ఆనందమయులు, కాగలరు. ఆనందమయులయిన గురువులే శిష్యులకు ఆనందము నందించుటకు అర్హులు. ఒక బిచ్చగాడు మరొక భిక్షుకుని శ్రీ మంతుడిని గావించలేడు. సంపన్నుడు మాత్రమే భిక్షుకుని కొంతవరకు ఆనంద పరచగలడు. అదే విధముగా ఆనందమయుడే ఆనందాన్ని అందించుటకు ఒక విధముగా అర్హుడు కాగలడు. కనుక ఈ బిడ్డలను ఏవిధమైనస్థాయికి కొనిపోవలెనన్న ఆశయం గురువులకు ఉన్నదో ఆ ఆశయానికి అనుగుణ్యంగా గురువులు ప్రవర్తించాలి. కాన మనము మొట్ట మొదట స్వప్రయత్నము చేత జీవితాన్ని ఆనందమయము కావించుకోవడానికి సాధనలు సలపాలి, వ్యక్తిసాధన, సమాజసాధన, విశ్వసాధన అనిమూడుసాధనలు ఒక్క పుష్పము హారము కాలేదు ఒక వృక్షము వనము కాదు, ఒక వ్యక్తి సమాజము కాదు. కనుక సమాజము, జాతి అనే తత్త్వానికి అనేక వ్యక్తులు చేరాలి, వనము అనుటకు అనేక వృక్షములు చేరాలి. హారము అను టకు అనేక పుష్పములు చేరాలి, కనుక ఈ సమాజ తత్త్వాన్ని మనం గుర్తించాలనుకున్నప్పుడు అనేక వ్యక్తుల సంస్కారము, సాధన, సత్సంపత్తి, చేరికగా ఉన్నపుడే అనంతమైన దివ్యత్వమును మనం ఏకత్వంగా దర్శించుటకు వీలవుతుంది.

గురువులనగా కేవలము అమాయకులైన విద్యార్థుల కు మనము అధికారస్థానము నందుండి బోధించే అహం కారమును గ్రహించకూడదు. అభిమానమే అహం కారమునకు ఒక సింహాసనము. కనుక అహంకార మనే సింహాసనం మనం అధిష్ఠించకూడదు. Humble, వినయమనే స్థానమును మనం ప్రతి ష్ఠించాలి. ఈ విధమైన వ్యక్తిత్వములో మార్పు చేసికోవడము పవిత్రమైన సాధనకు ఒక చిహ్నము. నిర్మల, నిశ్చల, నిస్వార్థ, పరులైన బాలబాలికలకు

బోధించే అవకాశము మనకు లభించిందని, ఇది మహా భాగ్యమని మనము భావించుకోవాలి.

ఈ విధమైన పవిత్రభావములు ఏనాడు మనము హృదయమునందు అభివృద్ధి పరచుకొందుమో ఆనాడే దేశముకానీ, సమాజముకానీ, ప్రపంచముకానీ ఉన్నత స్థాయిని, పవిత్రస్థాయిని చేరగలదు. కనుక ఈ సంకల్పవికల్పములనే వాటిని మనము క్రమక్రమేణా కొంత అణగద్రొక్కుతూ రావడానికి సాధనలుచేయాలి. కనుక మనస్సు ఒక ప్రత్యేకించిన స్వరూపము కాదనియూ, మన సంకల్పముల కలయికయే అను సత్యాన్ని మనం చక్కగా గుర్తించాలి. ఈ దేహము, ఇంద్రియములు, మనస్సు వీటి యొక్క రహస్యాన్ని మనం కొంత వరకు తెలుసుకున్నాము.

ఇంక బుద్ధియొక్క రహస్యాన్ని మనం గుర్తించాలి. బుద్ధి అనగా కేవలము నిర్ణయముచేయు స్థితి. దీనినే వేదాంతమునందు అంతఃకరణ అని అందురు. దీనినే అంతరాత్మ అనికూడ పిలుచుచున్నారు. ఒక విషయాన్ని తబ్బిబ్బై ఉండే స్థితియందు, confusion గా ఉంటున్న స్థితియందు, నిర్ణయపరచే సాధనమే బుద్ధి. మనం అనేక పర్యాయములు చెపుతుంటాము. ఏదైనా ఒక పవిత్రమైన భావము మనలో ఆవిర్భవించినపుడు నా అంతఃకరణ, ఈ విధముగా ప్రేరేపిస్తూంది, అని. అంతఃకరణ అనగా బుద్ధి యొక్క నిర్ణయమే. 'అంతఃకరణ' అనిననూ 'అంతరాత్మ' అనిననూ ప్రత్యేకించినది కాదు. బుద్ధియొక్క నిర్ణయమే అంతఃకరణ; బుద్ధియొక్క నిర్ణయమే అంతర్భావము అంతరాత్మ అనుటలో మరొక అర్థం కూడా ఉంటున్నది. ఆత్మకు సమీపంగా ఉన్నటువంటిది కనుక బుద్ధికి అంతరాత్మఅని కూడా మరొక పేరు. క్రింద దేహము, దానిపైమెట్టు ఇంద్రియములు, దానికి మరింత పైమెట్టు మనస్సు, దానికి పైమెట్టు బుద్ధి, బుద్ధికి పైమెట్టు ఒక్క ఆత్మమాత్రమే! దీనినే భగవద్గీత ఇంద్రియములను గుఱ్ఱములవలె, మనస్సును పగ్గమువలె, బుద్ధిని సారథివలె నిరూపిస్తూవచ్చింది. గుఱ్ఱములు నిరంతరము చంచలంగా దురుకుగా ఉంటున్నాయి. పగ్గములనే మనస్సు చాలా పటుత్వంగా ఉంటున్నది. సారథి బుద్ధిగా నిలచి ఉన్నాడు, కానీ, యజమానుడెవ్వరు? ఈ రథమునందు అధిష్ఠించినటువంటి వారెవరు? అతడే ఆత్మ. కనుక ఆత్మకు సారథిగా ఉండినటువంటి వాడు కనుక, బుద్ధి ఆత్మయొక్క నిర్ణయము. కనుకనే బుద్ధి పవిత్రుడుగా ఉంటాడు. ఎవరైనా యజమాని, ఒక డ్రైవరు కావాలనుకున్నప్పుడు సరియైన డ్రైవరు చిక్కాలని ఎన్నో ప్రయత్నాలు చేస్తూంటాడు. ఆ డ్రైవరు చక్కగా డ్రైవింగ్ తెలిసిన వాడుగా, గుణవంతుడుగా అన్ని విధములా యజమానుని అనుసరించే వాడుగా, ఉండాలి. అటువంటి వాడినే డ్రైవరుగా ఎన్నుకొంటాడు యజమాని. ఈ జగత్తునందు, డ్రైవరును ఎన్నుకోవడానికి ఇన్ని విధములైన అర్హతలను గమనించినపుడు ఇంక ఆత్మకు డ్రైవరుగా ఉండువాడు ఎంత పవిత్రంగా ఉండాలి? కనుక ఆ గా ఉండువాడే బుద్ధి. కనుక బుద్ధి యనునట్టిది, పవిత్రగుణములు కలిగినటువంటిది అయితే, ఎంత గుణవంతుడైనప్పటికినీ యజమానుని పర్మిషన్ లేకుండా ఈ రథములో కూర్చొనిపెట్టుకోవడానికి వీలు కాదు. కనుకనే 'బుద్ధి గ్రాహ్యమతీంద్రియం' అన్నారు. ఈ బుద్ధికికూడా అతీతమైన తత్త్వమును తెలుసుకునే నిమిత్తమై మనకు ఈ జన్మము ప్రాప్తించినదనే రహస్యాన్ని మనం తెలుసుకోవాలి.

సద్గుణవంతుడు కనుకనే వీనికి బుద్ధిమంతుడు అని

పేరు. బుద్ధిమంతుడైనా డ్రైవరు యజమాని పర్మిషన్ లేకుండా ఎవ్వరినీ కారులోకూర్చోపెట్టుకోడు. కొన్ని దుర్గుణములున్న డ్రైవరు మాత్రమే మధ్యమధ్య ఇతరులను ఎక్కించుకుని 'ఛారియట్'( chariot) ను తీసుకుని వెళ్ళిపోతుంటాడు. కనుకనే ఈ బుద్ధి అన్నది మనస్సువిర్ణయించిన కార్యాన్ని విచారణసలు పునది. కనుక మనము కొంతకాలమువరకు ఈ ఇంద్రియదేహ, మనస్సులను అనుసరించక బుద్ధిని అనుసరించడానికి కొంత తరిఫీదు గావించుకోవాలి. బుద్ధిని మనం అనుసరించినప్పుడు బుద్ధియొక్క "రికమెండేషన్" చేత ఆత్మసంతృప్తినికూడా మనము అనుభవించి తద్వారా ఆత్మానుగ్రహమునకు గురి అగుదుము. మన మనోవికల్పముచేత అనేక సంకల్పములు, అభివృద్ధి అయినప్పుడు నీవు తక్షణమే మనస్సును అనుసరించక బుద్ధికి నీవు అందించు. బుద్ధి విచారణ సలిపి ఇది మంచియా చెడ్డయా అనునిర్ణయానికి వచ్చేవరకు నీవు కాలము తీసుకో. ఈ నాడు లోకములో మనస్సును అనుసరించేవారే అధికంగా ఉంటున్నారు. ఈ విధమైన చాంచల్యముచేత అనేకవిధములైన మార్గములను అనుసరించి కడకు దుఃఖమునకు గురి అవుతున్నాడు, మానవుడు. సర్వవిధములైన అశాంతులకు మనస్సును అనుసరించడమే మూలకారణము. కాలమును మనం తీసుకుని బుద్ధి చెప్పు విచారణకు కొంతవ్యవధినందించి తద్వారా విదానముచేత మనము కార్యములో పాల్గొనుట మంచిది. సంకల్పములు కలిగిన తక్షణమే కార్యనిమగ్నులం కారాదు. తొందర పడటం మంచిది కాదు. Haste makes waste. Waste makes worry. so do not be in a hurry

ఈ తొందరపాటు మానవునకు అనేక కష్టనష్టములు గల్గించుచున్నది. ఈ విధమగు తొందరపాటును కొంత తగ్గించుకుని మానవుడు ఉద్రేకము లేక కోపము సంభవించినప్పుడు నాకింతకోపము వచ్చింది అని ఆ కోపమునే స్మరిస్తూపోవడంచేత కోపము మరింత అధికమైపోతుంటుంది. కోపసమయమునందుగానీ, ఉద్రేకసమయమునందుగానీ, మనము 'శాంతి శ్శాంతి శ్శాంతిః'అని ఈ 'శాంతి'ని అనేకపర్యాయములు స్మరించడంచేత ఈ ఉద్రేకముగానీ, కోపముగానీ చల్లారుటకు అవకాశముంటుంది. అయితే ఈ శాంతిని ఏవిధంగా స్మరించాలి? కోపసమయంలో 'శాంతి శ్శాంతి శ్శాంతిః'అని శాంతముగానే శాంతము చెప్పాలి. హద్దు లేకుండా మనం 'శాంతి శ్శాంతి శ్శాంతిః'అని చెప్పిన ఉన్న శాంతికూడా ఊడిపోతుంది. కనుక మనము 'శాంతి' అనేపదమును ఉచ్చరిస్తున్నామేకానీ వాక్కులోకానీ శబ్దములోకానీ శాంతము లేదు. ముల్లును ముల్లుతోనే ఏవిధంగా తీయగలమో, వజ్రమును వజ్రముతో ఏవిధంగా భేదించగలమో కర్మను కర్మద్వారా ఏవిధంగా మనము నిర్మూలము గావింతుమో, శాంతిని శాంతితోనే సాధించాలి. కనుక ఈ శాంతి తత్త్వమునేనాడు అభివృద్ధి పరచుకొందుమో. ఆనాడే మనము మానవత్వాన్ని గుర్తించునటువంటి వారమవుతాము. ఏతావాతా మనము గుర్తించవలసినది, దేహముయొక్క రహస్యము, మనస్సుయొక్క రహస్యము. ఇంద్రియములయొక్క రహస్యము, బుద్ధియొక్క రహస్యమును, మూడింటిని గుర్తించుకున్న తరువాత విర్వయులమయి పోదుము.

శ్రీ వారి దివ్యబోధ





శ్రీ సత్య సాయి కళాశాల పాత విద్యార్థుల సంఘంవారు 22-11-79 తేదీన ప్రదర్శించిన నాటకమందు "ఏసుక్రీస్తుగా" రూపక్ చంగ్‌కకోటిగారు

## ఈ దినమునుండి ----

ఈ దినమునుండి ఈ క్రింది విధముగా ప్రవర్తించుటకు నిశ్చయించుకోవలసినదిగా నా సలహా – ఇతరుల దోషముల నెన్నకుడు. పరదూషణ. పరహింస వదిలి పెట్టుడు; అసూయాద్వేషములు విడచి పెట్టుడు. మధురభాషణమును, వర్తనమును అలవరచుకొనుడు. భక్తివినమ్రతలతో సంభాషించుడు; ప్రేమతో, ప్రేమలో, ప్రేమకొరకు నివసింపుడు. మీరు ఏది కోరినను కోరకపోయినను, ప్రేమస్వరూపుడైన భగవంతుడు సమస్తము మీకు ఇచ్చును. బిడ్డ ఆకలిని గుర్తెరిగి, ఆహారము నందించు తల్లివంటివాడు భగవంతుడు. అతని ప్రేమ అంత విస్తృతమైనది, అగాధమైనది. నీ అవసరము నతడు ముందుగానే గుర్తించి, అవి తీర్చుటకు పరుగిడివచ్చును.

---

## పుస్తకములు

| | పేరు | వెల | తపాల ఛార్జి |
|---|---|---|---|
| 1. | అద్భుత మూర్తి_(హవార్డ్ మర్ఫెట్ ఆంధ్రానువాదం_అమరేంద్ర) | 6-00 | 0-10 |
| 2. | గీతావాహిని | 3-50 | 0-25 |
| 3. | ధ్యాన వాహిని | 1-50 | 0-15 |
| 4. | జ్ఞానవాహిని | 1-00 | 0-10 |
| 5. | ప్రేమవాహిని | 1-00 | 0-10 |
| 6. | భాగవతవాహిని | 3-00 | 0-25 |
| 7. | సత్యం శివం సుందరం (1) | 5-00 | 0-30 |
| 8. | ఆత్మారామం | 5-00 | 0-50 |
| 9. | సత్యం శివం సుందరం (3) | 5-00 | 0-25 |
| 10. | సూక్తి రసతరంగిణి (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-30 |
| 11. | శ్రీ సత్యసాయిశ్వర నుతి తరంగిణి (1) (ఉప్పాడ రాజారావు) | 3-00 | 0-25 |
| 12 | శ్రీ సత్య సాయిశ్వర నుతి తరంగిణి (2) (ఉప్పాడ రాజారావు) | 2-00 | 0-30 |
| 13. | మణిమాల | 2-00 | 0-15 |
| 14. | సువర్ణ సుమమాల | 5-00 | 0-30 |
| 15. | భజనావళి | 2-00 | 0-20 |
| 16. | సందేహ నివారిణి | 2-00 | 0-20 |
| 17. | శ్రీ సత్యసాయి వచనామృతము (1) | 3-00 | 0-35 |

కర్ణాటక రాజ్యపు బెంగుళూరు_67, బృందావనములోని వ్రజ్ బృందావన్ ప్రెస్ నందు కె. కె. అప్పయ్యచే ముద్రింపబడి, యన్. కస్తూరిచే, "శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్" ప్రశాంతి నిలయం, తరపున ప్రచురింపబడినది. ఎడిటర్ : యన్. కస్తూరి. యం. యే., బి. యల్.

# శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, శ్రీ సత్యసాయి సెంట్రల్ ట్రస్ట్, ప్రశాంతినిలయం,

పత్రికలు — పుస్తకములకు ఆర్డర్లు.

A (1) పత్రికలు : ఒక సం॥రు తక్కువ కానీ 5 సం॥ల కెక్కువకానీ స్వీకరింపబడవు.

| ఇండియా | | | వార్షిక చందా |
|---|---|---|---|
| మాస పత్రిక | సనాతన సారథి | ఇంగ్లీషు | 6 రూ. |
| మాస పత్రిక | సనాతన సారథి | తెలుగు | 6 రూ. |
| త్రైమాసిక పత్రిక | సేవాదళ్ | ఇంగ్లీషు | 4 రూ. |
| త్రైమాసిక పత్రిక | శ్రీ సత్యసాయి బాలవికాస్ | ఇంగ్లీషు, హిందీ (ఒకే పత్రికలోనే) | 5 .రూ |

విదేశములు

| | సనాతనసారథి | | సేవాదళ్ | | బాలవికాస్ | |
|---|---|---|---|---|---|---|
| | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ | సీమెయిల్ | ఏర్ మెయిల్ |
| | రూ. | రూ. | రూ | రూ. | రూ. | రూ. |
| ఆఫ్ఘనిస్థాన్ | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| ఆఫ్రికా | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| అమెరికా | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| ఆసియా ఖండపు దేశములు | 16 | 31 | 9 | 14 | 9 | 14 |
| ఆస్ట్రేలియా | 16 | 46 | 9 | 20 | 9 | 20 |
| బర్మా | 16 | 26 | 9 | 12 | 9 | 12 |
| యూరప్ ఖండపు దేశములు | 16 | 46 | 9 | 18 | 9 | 18 |
| పసిఫిక్ సముద్ర ప్రదేశములు | 16 | 51 | 9 | 20 | 9 | 20 |
| శ్రీలంక | 8 | 21 | 8 | 10 | 8 | 10 |

(2) సనాతవ సారథికి చందా పంపునపుడే ఏబాషలో (తెలుగు, ఇంగ్లీషు) కావలెనో తెలుపవలయును. చందా గడువు పొడిగించు సమయమునందును, మీ అడ్రసున్ను నందు మార్పు అవసరమని తెలుపు సమయమునందును చందా నంబరును వ్రాసి పంపవలయును.

B (1) పుస్తకములు : ప్రస్తుతము మా యొద్ద నున్న పుస్తకములు, వాటి వెలలు, ఇండియాలోని వాటి పోస్టు ఛార్జీలును క్రింద తెలియజేయబడినవి. రిజిస్టర్డ్ పోస్టులో మాత్రమే పుస్తకములు పంపబడును. కాన రిజిస్టర్ ఛార్జీ రూ. 2-25 లు మీ ఆర్డరుతో పంపవలసియున్నది. V.P.P. ద్వారా పంపబడవు.

(2) పుస్తకముల పూర్తి పేర్లు అవి ఏ బాషలో కావలయును అనునది స్పష్టముగా ఆర్డరులోనే తెలుపవలయును

(3) ఫోటోలు/చిత్రములు పోస్టులో పంపుటకు వీలు కాదు

(4) కార్యాలయము నుంచి వివరములు తెలుసుకొనవలెనన్న మీ చిరునామ గల స్టాంపు వేసిన కవరును పంపవలయును.

(5) పుస్తకముల ఆర్డరులు—విదేశములనుంచి తపాల ఛార్జీలు ఎంత అని ముందుగనే వ్రాసి తెలుసుకోవలెను

(6) చందా మొత్తము కానీ, పుస్తకములకొరకు పైకము కానీ, శ్రీ సత్యసాయి బుక్స్ అండ్ పబ్లికేషన్స్, ప్రశాంతినిలయం, అనంతపురం జిల్లా ఆంధ్ర ప్రదేశ్-పిన్:515134. యొక్క చిరునామాకే పంపవలయును. మనియార్డర్ పంపువారు వెనుకభాగమందు తమ చిరునామాను పూర్తి వివరములతో స్పష్టముగా వ్రాయవలయును.

(పుస్తకసూచి 24 వ పుటలో చూడండి)

Regd. No. KRNU-83

JANUARY 1980

అంతః కరణమను బండికి బాహ్యవిషయముల వైపు పరుగిడు బుద్ధి, మనసు అనే యెద్లను కట్టి నపుడే అది కదలగలదు. అయితే దానికి మునుపు బుద్ధి, మనసు అనే ఎద్దులకు, అంతః కరణము పోగోరునట్టి గ్రామములకు దారి తెలిసియుండ వలయును. వాటికి ఆ అభ్యాసమును నేర్పి యుండవలెను. అప్పుడు ప్రయాణము సునాయాన ముగా, సురక్షితముగా సాగును. అట్లుకాక, ఆ ఎద్దులకు సత్య ధర్మ శాంతి ప్రేమ అను రోడ్లే తెలియక. ఎన్నడూ ఆ మార్గమున ప్రయాణము చేయకుండిన, బండికే హాని కలుగును. బుద్ధి మనసను ఎడ్లకు రోడ్లమీద నడచుట, బండి లాగుట అనే విద్యలను నేర్పటమే, జపధ్యాన ములు అని అందురు.

బా బా

Regd. with Registrar of Newspapers No. RN/10772/64